


జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతీమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

వ్యవస్థాపకులు : డాక్టరు కే. యన్. కేసరి

ఆక్టింగ్ ఎడిటర్ : సి. సి. పున్నయ్య

★

# ఆగష్టు 15

ప్రపంచములోని వివిధ ప్రాంతపు వాతావరణము ఎట్టిదైనా మన దేశాన్ని అనాదినుండి కాపాడుతూవచ్చినవి ఆధ్యాత్మిక, నైతిక విలువలని గట్టిగా చెప్పవచ్చును. అంచలంచలుగా మనం సాధించిన విజయాలైనా, చేసిన ఘనకార్యాలైనా ఆధ్యాత్మిక, నైతికవిలువల పునాదిగా కలిగియుండినట్టివి. మన స్వాతంత్ర్య సమరమును, గాంధీజీ నాయకత్వమును, బోధనలను ప్రజలుచేసిన అఖండత్యాగములను పారజూచినచో మనకు స్వాతంత్ర్యము సిద్ధించుటకు ఆధ్యాత్మిక, నైతిక విలువలు ఎంతగా నుపయోగ పడినవో అర్థముకాగలవు. క్విట్ ఇండియా ఉద్యమంనాటి చిత్తశుద్ధి స్వార్థరహితమైన సేవాత్యాగాలు, ఉమ్మడిశ్రేయస్సుపట్ల ఆసక్తి పరిశీలనచేసికున్నచో ఆధ్యాత్మిక నైతికవిలువలు బోధపడగలవు.

దేశం ఎంత గొప్పదైనా, నాయకత్వము ఎంత బ్రహ్మాండమైనదయినా ఆధ్యాత్మిక, నైతిక విలువలను గుర్తించకలుగనిచో అవి యదార్థమైన అభివృద్ధి అభ్యుదయ మార్గాలలో నడువజాలవు. ప్రజలకు శాంతి భద్రతలతోబాటు సౌభాగ్యము సమకూరదు. పరస్పర సద్భావ, సహకారములకు ఆధ్యాత్మిక, నైతికవిలువలు పునాది.

ధర్మము, న్యాయములపట్ల ఆసక్తిలేని ఏజాతికాని, ఏదేశంకాని, ఏవ్యక్తి గాని తన శ్రేయపురోభివృద్ధిని తీర్చిదిద్దుకోలేదు సరిగదా సహజీవనానికి యోగ్యతను కోల్పోవును. అట్టి వ్యక్తిత్వం సర్వత్రా ప్రమాదకరమైనదే.

ఈ రోజున స్వాతంత్ర్యసిద్ధికి పోరాడి అఖండత్యాగాలు చేసిన వారిపట్ల శ్రద్ధా భక్తులు ప్రకటించవలసియున్నది. వారి ఆదర్శ, ఆశయాలను మననంచేసికోవాలి. వారు చూపినమార్గం ఉమ్మడి శ్రేయస్సున కుద్దేశించినది. ప్రతి భారతీయుడు ఉమ్మడి శ్రేయస్సుపట్ల ఆసక్తిచూపడానికి ఆధ్యాత్మిక, నైతికవిలువ ప్రతిక్షణం మార్గదర్శకం కావాలి.

—o—

బాల సాహిత్య సేకరణ

తెలుగులో పిల్లల సాహిత్యానికి సంబంధించిన గ్రంథాల జాబితా తయారుచేయ వలసిందిగా తెలుగు భాషా సమితిని ఆంధ్రప్రభుత్వం కోరింది. గ్రంధ కర్తలు, ప్రచురణకర్తలు, ఆయా గ్రంథాల ప్రతులను ఒక్కొక్కటి చొప్పున సమితి కార్యదర్శి పేర సెప్టెంబరు 5 తేదీ లోగా పంపి సహకరించాల్సిందిగా సమితి కార్యాలయ నిర్వాహకులు ప్రకటిస్తున్నారు.



అండమాను ద్వీపములలో నొకదానియందు బెంగాలునుండి వలసవెళ్లిన ఒక కుటుంబము వ్యవసాయమున కనువుగా భూమిని బాగుచేయుచున్న దృశ్యము

# లేత హృదయాలు

రచన :

శ్రీమతి కామరాజు మైత్రేయి

---

పిల్లలూ రండి. నా అఖరుఘడియలు సమీపించినట్లు వుంది. ఆశాలువయిలా అందుకోండి. నే కూచోటానికి ప్రయత్నిస్తాను. ఇలా దగ్గఱకు రండి! మిమ్మలను దగ్గఱగా తీసికుని చాల కబుర్లు చెప్పాలి. మీరు జాగ్రత్తగ నేను చెప్పినట్లు వినాలి.

పిల్లలు శాలువతెచ్చి మంచము దగ్గఱకు అందిచ్చారు. క్షీణదశలో వున్న ఆవిడ, ఆ శాలువ భుజాల మీదికి బాగా కప్పుకున్నది. రామం శారదకంటె రెండేళ్లు పెద్ద. కాని చాల విషయాల్లో అమాయకముగా వుంటాడు. వాడు మొదట అమ్మదగ్గఱ కూర్చున్నాడు. తన భుజముమీద ఆన్చిన తలను, తల్లి ప్రేమతో నిమిరింది. శారద ఒక్క నిమిషము తటపటాయించి తను అమ్మ ప్రక్కకు సర్దుకుంది. "నిన్న దేనినిగురించి మాట్లాడేమో మీకు తెలుసుకదూ" అంది అమ్మ. ఔనన్నట్లు తలూపారు పిల్లలిద్దరు.

రామం పది రూపాయలు తీసికుని, నీవు శారద కలిసి పిన్ని దగ్గఱకువెళ్లండి. వాళ్ల టామీతో ఆడుకుంటే ఎంతో బాగుంటుంది కదూ! పిల్లలు తలూచారు: వీళ్లకి తెలుసు, టామీ బలేహుషారైన కుక్కపిల్లని. ఎప్పుడు అల్లరికోసము ఎదురుచూస్తూ వుంటుందని, నోటితో బంతిని పట్టుకుని పరిగెట్టకలదని. కాని, వీళ్లకి తృప్తిగా, దానితో ఆడుకోవటము కుదరలేదు. అమ్మ ఎప్పుడోగాని తనుని తీసికుని పిన్నిగారింటికి వెళ్లేదికాదు.

సరే! మీరింక పిన్నిగారింట్లోనే వుండి, మీ యిష్టము వచ్చినంతసేపు టామీతో ఆడుకోవచ్చు. అక్కడే పడుకోవచ్చు. టామీ మీతోటే వుంటుంది. అవుతే మీరు భయపడకండా వుంటారు కదూ!

పిల్లలిద్దరు "ఔ" నని ఒకేమాటు అన్నారు. "అమ్మ మీతో కూడా రాదు. మీరు పెద్దవాళ్లలాగ నడుచుకోవాలి. రాత్రిళ్లు మీకు దాహమువేస్తే పిన్నిని నిద్రనుండి లేపకుండ మీరే దీపము వెలిగించుకుని, మంచినీళ్లు త్రాగాలి. పిన్నికి మీరంటే యెంతో యిష్టము, మిమ్మలను ఎంతో ప్రేమగా చూస్తుంది, మీరుకూడ పిన్ని చెప్పినట్లు వింటూ, ఆవిడమీద ప్రేమగా వుండాలి. పిన్ని మిమ్మలను ముద్దుగ చూస్తుంది, బడికి పంపుతుంది. మీకు మిగత పిల్లలాగ బడికివెళ్లి చదువుకోవాలని వుంది కదూ!"

అవును అమ్మా! అన్నారు రాము, శారద కూడ. "నాన్నలూ, పిన్ని ఎక్కడ వుంటుందో, మీకు గుర్తుందా?"

"గుంటూరు" అన్నారు యిద్దరు.

అక్కడకు ఎలా వెళ్లాలో మీకు తెలుసునా? ఓ అని తలూపారు పిల్లలు.

రామం! బీరువాలోని పది రూపాయలనోటు తీసుకొని, అందులో పెట్టె పట్టుకురా! నాన్నా.

రామం లేచి డబ్బు, బీరువాసొరుగులోని పెట్టె తెచ్చి అమ్మకు అందిచ్చాడు.

నోటు పోగొట్టుకోనవు కదా! ఎక్కడ పెట్టుకుంటావో చూస్తాను. సరే! శారదా నీవు చూడు, వాడు ఏ జేబులో పెట్టుకున్నాడో, నీకు జ్ఞాపకం వుంటుంది. ఇంక తనదగ్గరవున్న పెట్టె తెరిచింది ఆవిడ. ఇటు చూడండి, ఒక ముఖ్యమైన విషయము చెప్పాలి మీకు _ ఈకార్డు చూచారా, దీనిలో ఏమి వ్రాసి వుందో చదువుతాను జాగ్రత్తగ వినండి.

కె|| రాఘవేంద్రరావు, 27వ పట్టాభిపురం, గుంటూరు. ఇది పిన్నివాళ్ల అడ్రెసు. ఈకార్డు జాగ్రత్తగ దాచుకోండి. మీరు వెళ్లేది అక్కడకే.

స్టేషనుకు వెళ్లి గుంటూరుకు టిక్కెట్టు కొనుక్కొని భద్రముగ, టిక్కెట్టు కలెక్టరు సాయంతో బండి ఎక్కండి. గుంటూరులో బండిదిగి, యీ కార్డుమీది అడ్రెసును చూసి యింటికి వెళ్లండి. ఇదిగో రామం యీ వుత్తరం వెళ్లగనే పిన్నికి యివ్వు. ఇది నీ పెట్టెలో దాచుకో. మీరు స్టేషనులోకాని, వెళ్లేప్పుడుకాని దిక్కులు చూడకండ, రోడ్డు జాగ్రత్తగ దాటండి. యిద్దరు చేతులు పట్టుకొని మరీ వెళ్లండి.

సరేలేవే, అమ్మా!

ఇప్పుడు మీ యిద్దరికి చక్కటి కాయిలాలు యిస్తాను. రామం యిటూరా. ఇదిగో మీ నాన్న [illegible]

గడియారము గొలుసు. ఇది నీకు. యిప్పుడు నేను దీనికి కీ యిస్తాను చూడు. రేపటినుంచి నీవే యివ్వాలి అంటూ ఆవిడ ఆ గడియారాన్ని రామం జేబులో వుంచింది. గొలుసు కోటుబైటకు తగిలించింది. నాన్న పేరేమిటో మీకు జ్ఞాపకము వుంది కదా! ఆ! నారాయణమూర్తిగారు అన్నారు యిద్దరు ఒకేమాటుగా. సరి! ఎప్పటికీ నాన్నను మరవకండి. ఇదిగో శారదా మీ అమ్మమ్మగారి గొలుసు. ఆ గొలుసుతోపాటు నా వుంగరముకూడ అందులో వుంచుతాను. పెద్దదానవైన తర్వాత వేలికి వుంచుకుందువుగాని అంటూ తన వ్రేలివుంగరము తీసి గొలుసులో వేసి పిల్ల మెడలో పెట్టింది. ఎంత చక్కగ వుందే తల్లి! ఇవే నేను నీకీయకలిగినది. ఇప్పట్లో మీ అమ్మ మీకీయకలగిన మంచివస్తువు మిమ్మలను తిరిగి బడికి పంపగలగడమే! మిమ్మలను చాలరోజులు బడి మాన్పించాను. మీరు ఎంతో శ్రద్ధా, ప్రేమలతో నాకు సేవచేశారు. ప్రేమ, శ్రద్ధలే మందులై వుంటే, యీపాటికి నా జబ్బు నిమ్మళించేది. మీరు తిరిగి బళ్లోకి వెళ్లండి. పిన్ని, బాబాయి మిమ్మలను లాలనగా చూస్తారు. నేను ఎక్కడకో చాల, చాల దూరము వెళ్లిపోతాను.

చాల దూరమా? అంది శారద.

అవును చాలదూరము.

మమ్మలను అప్పుడప్పుడు వచ్చి చూస్తావా?

ప్రయత్నిస్తాను. ఎలాగో ప్రయత్నిస్తాను. కాని పిల్లలూ! మీరు మాత్రము చక్కగ, బుద్ధిమంతుల్లాగ వుండాలి. పెద్దవారైతే మీకు తెలుస్తుంది. రామూ! నీవు చెల్లెలిని ప్రేమగా చూచుకుంటానని మాట యివ్వు. చెల్లికూడ, నాలాగే నిన్ను ప్రేమతో చూస్తుంది. మీరిద్దరు యేవిషయముల్లోనూ పోట్లాడుకోకూడదు. మీరిద్దరు కలిసికట్టుగా వుంటే లోకాన్ని ఎదిరించేశక్తి వస్తుంది తెలిసిందా? అలాగే, కలిసిమెలిసి వుంటామని నాకు మాట యివ్వండి.

అలాగే వుంటాము అమ్మా!

శారదా! నీవుకూడ పెద్దదానవై, నాలాగే అన్నయ్యను జాగ్రత్తగ చూసుకుంటావు కదూ?

అలాగే అని తలూపింది శారద.

నేను యింతకంటె యెక్కువ చెప్పలేను. చెప్పినా మీరు మరచిపోతారు. ఇంకొకమాట మీరు యెప్పుడు కాని ధైర్యాన్ని వదలిపెట్టకండి. ఒక్కమాటు నా దగ్గరకు వచ్చి నాకొక్క ముద్దు యిచ్చిపోండి.

పిల్లలిద్దర్ని పక్కన చేర్చుకుని తనివితీర ముద్దు పెట్టుకుంది. దానితోటే ఆవిడలోని శక్తి అంతా పూర్తి అయినట్లు, మంచము మీదకు వాలిపోయి, వెళ్లేదు పుచ్చుకుని వెళ్లిపోతుండే తన పిల్లలకు హీనస్వరముతో, ధైర్యముగ వుండండి పిల్లలూ, అంటూ వుండిపోయింది. నేను ధైర్యముగ వుంటాను.

అలాగే అమ్మా అన్నారు పిల్లలిద్దరు. తలుపు ఓరగవేసి వెళ్లండి. రామం! శారద చేయిపుచ్చుకో. దేవుడు మిమ్మలను కాపాడుతాడు అంటూ ఆవిడ, వచ్చేదుఃఖాన్ని ఆపుకుంటూ, వెళ్లే పిల్లలకు చేయి వూపి, పోయిరమ్మని, శెలవు యిచ్చింది. పిల్లలుకూడ వెనుదిరిగి, అమ్మ శుష్కమైన నవ్వుమొహాన్ని చూసి వారు నవ్వుమొహము పెట్టేరు. తలుపు దగ్గర సావేసి, పిల్లలు వెళ్లిపోయేరు.

శారద మెట్లు దిగుతూ యింకొకమాటు "వెళ్లి వస్తామమ్మా" అంది. రామం 'పదపద! ఆవిడ నిన్ను యిక్కడనుంచి చూడలేదే' అన్నాడు.

తలుపుమూసి పిల్లలు వెళ్లిపోగానే, ఆవిడ యిక వుండలేక పోయినది. రెండు చేతులతో ముఖము కప్పుకొని వెక్కివెక్కి తన హృదయములోని దుఃఖాన్ని వెళ్లబోసుకుంది. తనసుంచి యీ చివరి బంధము తెగిపోయినదని తెలుసుకుని ఆవిడ నిశ్చింతగ కళ్లుమూసుకుని పడుకుంది.

ఇంటికి రెండు వీధుల అవతలవుంది స్టేషను. శారద, రామం ఒకరిచేయి ఒకరుపుచ్చుకొని, యీ విశాల ప్రపంచములోకి నడుస్తున్నారు. మధ్య మధ్య షాపుల కిటికీల్లోకిచూస్తూ నిలబడిపోయిన, శారదను "పద చెల్లీ" అన్నాడు రామం, స్టేషను చేరగనే, తన దగ్గఅవున్న పావలా పెట్టి రామం రెండు లాలీపాపులు కొన్నాడు. చెల్లి ఒకటి తింటూ స్టేషనులోకి వెళ్లేరు.

బుకింగు కిటికీ దగ్గరకు వెళ్లి రామం పది రూపాయల నోటుయిచ్చి రెండు టిక్కెట్లు గుంటూరుకు కొన్నాడు. మిగతాడబ్బులు జేబులో వుంచుకున్నాడు. టిక్కెట్లు, టిక్కెట్టు కలెక్టరుకు చూపించారు. అతను, పిల్లలిద్దర్ని బండిలో కూర్చోబెట్టాడు. రామం, ఒకమాటు తన జేబుగడియారము పైకితీసి స్టేషను టైముకు సరిదిద్దుకున్నాడు. శారద తనలాలీపాపుచీకుతూ రామంవైపు చూస్తూకూచుంది. ఎదర కూచున్న పెద్దమనిషి అతను, "మీ అమ్మగారు మీతోటి

రాలేదా" అని అడిగాడు. "మా అమ్మగారు వెళ్ళిపోయినారు."

వేరేవూరు వెళ్లేరా ? — అవును.
ఏవూరు వెళ్లేరు ?

మనుష్యులు చచ్చిపోతే యెక్కడికో అక్కడికి.
హారే, దైవమా ! అక్కడికా ?

అవును. మా అమ్మకు చెప్పటము యిష్టము లేదు కాని ? మాకు తెలుసు, అన్నారు యిద్దరు.

3

పిల్లలు గేటు తెరుచుకుని, రావడము చూసినటామీ ఎగిరి గంతేసి, గడ్డిలో దాచివుంచిన రబ్బరు బంతిని నోట్లో కరుచుకునివచ్చి పిల్లలను ఆటకు పిలిచింది. అప్పుడే, బయటకువచ్చిన పిన్ని పిల్లలను చూచి "ఎప్పుడు వచ్చార్రా మీరు చిట్టిబాబులు" అని పిల్లలను దగ్గరకులాలనగ తీసుకుంది. "బహుశా ! మీ అమ్మ మిమ్మూలను యిక్కడికి పంపిందేమో మీరంటే మాకెంతో యిష్టమని ఆవిడకు తెలుసు." పిల్లలు జవాబు చెప్పలేదు.

అమ్మ బాగుందా ?

"ఓ" అని రామం తలూపాడు. "లోపలికిరండి పాలు రొట్టె, పండ్లు తిందురుగాని, ప్రొద్దున ఎప్పుడు తిన్నారో" అని పిన్ని వాళ్లకు రొట్టె, పాలు, పండ్లు యిచ్చింది. శారద, రామం, టామీతో ఆడుకోవడముకోసము, టిఫిను తొందరగ, తొందరగ పూర్తి చేసుకుని బయటకువచ్చేరు. ఒక గంటసేపు కుక్కతోటి కులాసాగా గంతులేసేరు.

రామానికి అమ్మ యిచ్చిన జాబు సంగతి చటుక్కున జ్ఞాపకమువచ్చి, శారదకు చెప్పేడు. శారద గబగబ లోపలికెళ్లి తనపెట్టె తెరచి జాబుతీసి పిన్నికిచ్చింది. అమ్మ తన కిచ్చిన జాబు.

'ఏమిటిది,' అంది పిన్ని.

అమ్మ వుత్తరము యిచ్చింది? అంది శారద.

పిన్ని వుత్తరము చింపి చదివింది.

చి॥ సౌ॥ సీతకు :—

అనేక, ఆశీర్వచనములు. నేను వేళ్ళేచోటికి పిల్లలను తీసికెళ్ళలేను ? అందుచేత నీవద్దకు పంపుతున్నాను. నా విషయమున నీకేమి నచ్చదని తెలుసు. నేను ఇటువంటిస్థితిలో వున్నాను. నీవు వ్రాసే, సూటి పోటి మాటలు వినేస్థితిలోలేను, వాటి వుపయోగము కనిపించనందున, నీ చివరి వుత్తరాలు చింపకుండగనే, నీకు తిరిగి పంపివేసేను. అవును! చెల్లీ! నేను ఒక త్రాగుబోతును పెండ్లాడేను. ఆయన వున్నప్పుడు! మేమెంతో ఆనందంగా రోజులు గడిపాము. ఈ విషయము నీకు తెలియదు. తెలిసినా నీకు అర్థముకాదు. మీవారు నీకు, చీరెలు, నగలు, ఐశ్వర్యము యిచ్చారు. మావారు నాకు, బీదరికము, వైధవ్యము యిచ్చారు. కాని నాకు పిల్లలున్నారు. ఇంతవరకు, ఎలాగో జీవితాన్ని గడిపాను.

సీతా! పిల్లలు, అమాయకులు. నామీద కోపము వాళ్లమీద చూపించబోకు. మృత్యువును విమర్శించవద్దు. పిల్లలను ప్రేమతో చూస్తే వాళ్లే నీకు ఆనందాన్ని యిస్తారు. జీవితాన్ని సుఖమయము చేస్తారు. ఇంతకంటె ఏమి వ్రాయలేను. పిల్లలే, నా సర్వస్వము. వారిని ప్రేమతో ఆదరించు.

ఇట్లు :
లక్ష్మి,

పిన్ని వుత్తరము చదివేవరకు, ఆవిడనే చూస్తూ నిలబడింది శారద.

"ఇందులో ఏమివుందో తెలుసా" అంది పిన్ని. తెలుసు అన్నట్లు తలూపింది శారద. పిల్లలను దగ్గరకు తీసుకుని ముద్దుపెట్టుకుంది. శారద మెడలో గొలుసు కూడ చూచింది.

సీత, భర్తను పిలవడానికి ఫోనుదగ్గరకు వెళ్లింది. భర్తఫోను దగ్గరకురాగానే.

మీరింకా ఆఫీసులో వున్నారా? ఎందుకు? శారద, రామం, కొద్దిసేపటికి క్రిందనే యిక్కడకు వచ్చేరు.

"చాల సంతోషము, ఇప్పటికైన, మీ అక్కయ్యతో రాజీ పడ్డావన్నమాట. పిల్లలనుగురించి నాకు బెంగగానే వుంది." రాఘవేంద్రరావుకూడ, శారద,, రామం అంటే యెంతో ప్రేమ.

"నేను అక్కయ్యతో రాజీ పడలేదు. పిల్లలు అచ్చగా యిక్కడికే వచ్చేసారు. కొద్ది సేపట్లో మీకే తెలుస్తుంది. వెంటనే మీరు కారులో బెజవాడ వెళ్లి పరిస్థితులు చూసిరండి."

4

మృత్యుదేవత. రాఘవేంద్ర కన్ను మూయడుగానే

లక్ష్మి గదిలో ప్రవేశించింది. తలుపుమాత్రము ఓరగా వేసివుంది.

రాఘవేంద్రరావు లక్ష్మి అంత్య క్రియలుచేసి యింటికి తిరిగి వెళ్లేటప్పటికి, చాల ప్రొద్దుపోయింది.

"అక్కయ్య ఎలా వుంది."

"నేను వెళ్లేప్పటికే పోయింది. ఆవిడకు చేయ వలసినవన్నీ చేసివచ్చేను. పిల్లలు పడుకున్నారా?"

"ఆ, పడుకున్నారు."

"బాబాయి" అంటూ మేడమీదనుంచి పిల్లలు పిలిచారు. వస్తున్నానర్రా అంటూ రాఘవేంద్ర రావు గబగబ మేడమీద్దకి వెళ్లేడు. పిల్లలు మేలు కునే వున్నారు. తనువచ్చేప్పటికి వాళ్లు మెలుకువగా వున్నందుకు, అతనికి యెంతో సంతోషము వేసింది. పిల్లలిద్దరు బాబాయి మీద్దకి, ఎగబడి మెడచుట్టు వేసి, యిద్దరు ఒకేమాటు బాబాయితో చిలిపి కబుర్లు, ముద్దుముద్దుగ చెప్పడము మొదలెట్టారు. టామీతో, వారు ఆడుకున్న కబుర్లు, వారు దానికి నేర్పిన కొత్త విద్యలు, ఒకరికంటె ఒకరు, ముందు చెప్పను పోసాగారు. సరదాగా కబుర్లు చెబుతునే, మధ్యలో, శారద "బాబాయి అమ్మను చూచావా?" అని అడిగింది.

బాబాయి జవాబు చెప్పలేదు.

"మమ్మల్లను ధైర్యముగ వుండమంది మా అమ్మ, మా కంతా తెలుసులే" అన్నాడు రామం.

"ఏమిటి తెలుసునురా." అన్నాడు బాబాయి.

అమ్మ చాలదూరము వెడుతుందని, దేవుడిని చూడటాని వెడుతుందని మాకు తెలుసునులేరి అవిడ వెళ్లిందా? "ఆ వెళ్లింది." అంతకంటె ఏమియొక్కువ చెప్పలేకపోయినాడు.

పిల్లలు, ప్రక్కలమీదకు వెళ్లి అమాయికంగా, తీయటి కలలుకంటూ నిద్రపోయారు.

5

తెల్లారింది అప్పటికే టామి వంటింటి గడపలోతన వాటా రొట్టె పాలకోసము నిలబడివుంది. పిల్లలు టామీకూడ, గబగబ తినేసి, ఆడుకోటానికి బయ లుకు పరిగెట్టిపోయారు. ఆటల్లోవాళ్ళకు తీరుబడే లేదు. ఒక నిమిషము శారద. "రామం, అమ్మ యింకరాదా" అన్నది, రామం, "అమ్మ యింకరాదు" అన్నాడు.

"విశాల ప్రపంచమంటే ఏమిటే" అన్నాడు రామం. "నాకు తెలియదురా" అంది శారద.

తిరిగి వాళ్లు టామీతో ఆటలో మునిగిపోయారు.

—o—

ఒకరసిక భక్తాగ్రేసరుడు దారిననడుస్తూ ఒకయింటిముందు నిలబడి యింట్లో యిల్లాలు పాడుతున్న పాటవిని తన్మయుడౌతుంటాడు. కొంతసేపటికి ఆయిల్లాలు బయటికి వస్తుంది.

"ఆహా! ఏమిపాట తల్లీ! భక్తి రసం ఉట్టిపడుతున్నది. అది వింటున్నంతసేపు పరమాత్మతో ఐక్యమైపోయి ఆనందడోలికలలో నూగిసలాడినట్లయింది"

ఆ యిల్లాలు "అదాండీ! - రోజూ కోడిగ్రుడ్లు ఉడకబెడుతూ పాడే పాటే" అన్నది తేలికగా.

బొడ్డుపల్లి వేంకటప్పయ్యశర్మ



# "అవతార్" శివానంద భగవానుల సంగ్రహ జీవితచరిత్ర

'శివానంద పాదసేవక్' శ్రీ స్వామి శ్రీనివాసానంద సరస్వతి



శ్రీస్వామి శివానంద సరస్వతి మహారాజుల పూర్వాశ్రమ నామము శ్రీ కుప్పుస్వామి, అపరశివావతారమన బరగు శ్రీ అప్పయ్య దీక్షితుల వారి వంశమునకు చెందిన దాక్షిణాత్య శ్రోత్రియ బ్రాహ్మణ వర్యులు వారు 8_9_1887 న (సర్వజిన్నామ సం॥ర భాద్రపద బహుళషష్ఠి గురువారము భరణి నక్షత్రములో) 4-17 A. m. కు బ్రహ్మముహూర్తమున మద్రాసు రాష్ట్రమునగల "తిరునల్వేలి" జిల్లాయందలి "పట్టమడయి" గ్రామములో జననము. 10 సం॥లు మలయాలో డాక్టరుగపనిచేసిరి. 1.6-1924 న హృషీకేశములో శ్రీ స్వామి విశ్వానంద మహారాజులనుండి సన్యాసముగొనిరి. M. B., B. S., M. R. A. S., (Member of the Royal Asiatic Society), M. R. I. P. H. (Member of the Royal Institute of Public Health), A. R. San. I. (Associate of the Royal Sanitary Institute) మున్నగు డిగ్రీలెన్నియో సన్న్యాసాత్పూర్వము వహించియుండిరి. 8-9-1930న ఆత్మసాక్షాత్కార భాగ్యశ్రీ నొందిరి. 1932లో శివానందాశ్రమమును స్థాపించిరి. 1936 న దానినే దివ్యజీవన సంఘముగ (DIVINE LIFE SOCIETY) వెలువరిచిరి. దాని శాఖాలు హిందూదేశము సర్వత్రను, జర్మనీ, అమెరికా, యింగ్లండు, స్విట్జర్లండు, పోలెండు, సింగపూరు, దక్షిణాఫ్రికా, చైనా యిండోనీషియా, జపాను, ఆస్ట్రేలియా మున్నగు విదేశముల మొత్తము 350 కు పైబడిగలవు. 1948 లో యోగవేదాంత ఆరణ్య విద్యా పరిషత్తు (Yogavedanta Forest Academy) నెలకొల్పబడినది. ఆయనచే సాంగ్లమునరచింపబడిన ముద్రితగ్రంథము లీసరికి (అముద్రిత గ్రంథములుగాక) మూడువందల (300) లుండును. ముద్రితగ్రంథములు దేశీయ భాషలగు తెలుగు, అరవము, మళయాళము కన్నడము, గుజరాతీ, మరాఠీ, సింధీ, ఉర్దూ, బెంగాలీ, హిందీ ఒరియామున్నగు భాషలలో మాత్రమేకాక విదేశీయభాషలగు జర్మను, ఫ్రెంచి, జపాను, స్పానిష్, రష్యను, బర్మా, లాట్వియన్, ఎస్పరాంటో, బల్గేరియన్, డచ్, చైనా, యిండోనీషియామున్నగు భాషలలో సహితము తర్జుమాయొనర్పబడినవి. దివ్యజీవన సంఘశాఖల తరఫున, ఫ్రెంచి, జర్మను, ఇండోనీషియా, ఆంగ్ల భాషలలో విదేశముల వివిధసామయిక పత్రికలు (Periodicals) నడుచుచున్నవి. అటులనే స్వదేశమున దివ్యజీవన సంఘశాఖల తరఫున కన్నడము, అరవము, గుజరాతీ యింగ్లీషు భాషలలో ప్రస్తుతము మాసపత్రికలు



నడుచుచున్నవి. గతమున తెలుగునకూడ "శివానంద వాణి," "ప్రాణజీవిని," "దివ్యజీవనము" అను మూడు వేర్వేరు పత్రికలు నడచెడివి. అదేమాదిరిగ మరాఠీ, హిందీ, బంగాళీ భాషలలోను నడచెడివి. ప్రపంచమందలి పత్రికల కన్నింటికి శివానందుల వ్యాసములు ప్రతి నెల తప్పనిసరిగ జనుచుండును. హిందూ దేశములోని సర్వభాషలలోని పత్రికలలో సదా ప్రచురితమగుచుండునని వేఱే తెలుపబనిలేదు.

శివానంద నగరమునుండి వెలువడు ఆంగ్లమాస పత్రికలు "DIVINE LIFE" "WISDOM LIGHT" "BRANCH GAZETTE" "HEALTH AND LONG LIFE" యను నాలుగుమాత్రమే. YOGA VEDANTA FOREST ACADEMY WEEKLY అను (వార) పత్రిక యొకటికూడ నాంగ్లమున బయల్వెడలును. ఇవిగాక రాష్ట్రభాషయనదగు హిందీలో కూడ "యోగవేదాంత"యను పతియొక మాసపత్రికయునడుచుచున్నది. శ్రీ శివానందులవారియ మూల్యగ్రంథములు పత్రికలన్నియు నాధ్యాత్మికమగు యోగవేదాంతములకు నారోగ్యమునకు సర్వదృక్కోణముల సంబంధించినవి మాత్రమే. ప్రపంచ శాంతికి మానవాభ్యుదయమునకు లోకకల్యాణమునకై శ్రీ శివానందులొనర్చుచున్న నిరుపమ సేవలకు ముగ్ధులై పలువిదేశ సంస్థలు (Foreign Institutions) శ్రీ గురుభగవానులకింతవర కొసగిన వివిధ బిరుదములు (titles) యిరువది తొమ్మిది (29.)

1950 వ సం॥ములో భారతదేశము సింహళ (Ceylon) మంతట నాధ్యాత్మిక ప్రచారమొనర్చుచు పర్యటించిరి. 1953 లో విశ్వమతముల సమావేశము (Parliament of world Religions) ను శివానందనగరమున నిర్వహించిరి. శ్రీ గురుదేవులకు వివిధమత విశ్వాసములకు (religious faiths) వేర్వేరుహోదాలకు (Positions) చెందిన స్త్రీ పురుషశిష్యులు ప్రపంచమంతటగలరు. ఇతర విభాగముల (departments)కు చెందువాటి మాటటుంచి శ్రీ శివానందుల ప్రత్యేకవీక్షణ సలహాలకై ప్రతి నెల కనీసము రెండు వేలకు (2000) తక్కువలేకుండ ప్రపంచపుటన్ని మూలలనుండియు నారోగ్య ఆధ్యాత్మిక లౌకిక సంబంధపు టుత్తరములు వీరు, వారనక సర్వతరహాల (status) వారినుండియు వచ్చును. ఆంగ్లమునకేకాక దేశీయభాషలగు తెలుగు, అరవము హిందీ, కన్నడము, మళయాళము వగైరా భాషలలోను శ్రీ గురుదేవుల పర్యవేక్షణ, జాబులకై నుత్తరములువచ్చును. సంకల్ప ప్రసారము (thought transmission) రీత్యా తపాలుద్వారా దూరదేశస్థులకు వారి కోరిక పైని, వారివారి యిష్టదైవ మంత్రోపదేశము (Mantra initiation) నొనర్తురు. ప్రపంచమంతటి వందలాదిగ స్త్రీ పురుషులు శ్రీశివానందుల ఆదేశ ప్రకారము తమతమ మత విశ్వాస రీత్యా ప్రతినెల సాధన (అనుష్టానము) నొనర్చుచు నాధ్యాత్మికదైనందిన (Spiritual diary) యు, పూర్తిచేసిన మంత్రలేఖన పుస్తకములు (Mantra writing note books) శ్రీ గురుదేవుల విమర్శ నాధ్యాత్మిక ముందంజ (Spiritual advance) కై సూచనలకు పంపుచుందురు.

ఇందాశ్రమమున భారతదేశమందలి సర్వప్రాంతముల వారును సర్వ ముఖ్యభాషలవారునుగలరు. ఇది హిందూ దేశమునకు మాత్రమేగాక ప్రపంచమున కంతటికిని సంబంధించిన నంతర్జాతీయ సంస్థ (International Institution) యగుటచే సదా నాధ్యాత్మికముగ కార్యభారముతో కలకలముగ (busy) నొప్పారును.

హిమాలయ పర్వతావృతమై గంగ కివతలియొడ్డున హృషీకేశ, లక్ష్మణఝూలాల మధ్య శ్రీ బదరీనారాయణము, కేదారములకు పోవు బస్సుదారిని "మునీకీరేతి (Muni Ki Reti) యను మండలము (Zone) లో నీయాశ్రమము గలదు. బెజవాడ, ఢిల్లీమీదుగ గాని లేదా వాల్తేరు, హౌరా (కలకత్తా) మీదుగగాని వచ్చువారు హరిద్వారములో దిగి బస్సుపై వచ్చుచో "శివానందాశ్రమము" వద్దనే సరాసరి దిగవచ్చును. [హృషీకేశమునకు రైలు గలదు. స్టేషను నుండి యాశ్రమమునకు 1½ మైళ్లు దూరముండును. హరిద్వారమునుండి హృషికేశమునకు 16 మైళ్లు ]

ఆశ్రమమున శ్రీ విశ్వనాథమందిరము, ముద్రణాలయము, ఛాయా చిత్రాగారము (Photo studio) యోగ వస్తుప్రదర్శనశాల (Yoga Museum) నిర్విరామ అనగా 24 గంటల సంకీర్తనకగు భజన భవనము, అన్నపూర్ణక్షేత్రము, ఆయుర్వేద వైద్యశాల, నేత్ర చికిత్సాలయము (Eye Hospital) విదేశీవైద్య (allopathic) ఆస్పత్రి. ప్రకృతివైద్య సదనము, సత్సంగ భవనము మున్నగు పలువిభాగములు కలవు. ఇంకను నాశ్రమమున తంతి (telegraph) దూరశ్రవణవాహకాగారము (telephone) లతో సహా తపాలా కార్యాలయము (Post office) గలదు.

శ్రీ గురుభగవానులు (శివానందులు) మొత్తముపై నొక లక్షరూపాయలకు పైబడు విలువగల తమ గ్రంథములను, పదివేల రూపాయలకు మించు విలువ చేయు నాయుర్వేదౌషధముల నుచితముగ ప్రపంచమంతటగల భక్తవరులకు ప్రతి సంవత్సరము పంపుదురు. ప్రతినిత్యము ప్రపంచపు నలుమూలలగల శ్రీ

(413 వ పేజి చూడుడు)

# నిరుపమ

మూలం :
"నిరాల"

అనువాదం :
"అరుంధతి"

కుమార్ బాబు యూరపులోని చాల దేశాలు తిరిగి, లండన్ విశ్వవిద్యాలయం నుండి ఇంగ్లీషు సాహిత్యంలో డి. లిట్. డిగ్రీ తీసుకుని స్వదేశానికి తిరిగి వచ్చాడు. అతడికి కలకత్తాలో నిలబడ్డానికి కూడ స్థానంలేక, లక్నో యూనివర్సిటీలో యేదైనా ఉపాధి దొరక్కపోతుందా అన్న ఆశతో లక్నో వచ్చాడు. కాని తన ఆశలన్నీ అడియాసలైనాయి. అక్కడకూడ అతన్ని ఆదరించే వాళ్లెవరూ లేకపోయారు. కులమత వివక్షణ, బంధుప్రీతి అతనికి ఎదురొచ్చాయి. అందువల్లనే తనకు వచ్చిన అవకాశాన్ని బాబు యామినీహరణ ముఖర్జీ హరించాడు. నిట్టూర్పుతో క్రైస్తవ కళాశాలకు వెళ్లాడు కుమార్ బాబు. కాని అక్కడ కూడా వర్ణాశ్రమధర్మాలే యెదురొచ్చాయి. ఆఖరికి తాను చదివిన చదువంతా యెందుకూ పనికిరాకుండా పోయింది.

ఆ మండు వేసంగిరోజున వెళ్లినచోటకు తిరిగి వెళ్లకుండా అన్నిచోట్లకు వెళ్లాడు. ఎక్కడకూడా తనకు ఉద్యోగం దొరక్కపోయినా అతడు మాత్రం నిరుత్సాహపడక — విద్యనిగూఢగుప్తమనే వాక్యం తలుచుకుంటూ ఆశతోనే వున్నాడు.

కోహినూర్ హోటల్లో కుమార్ బసచేస్తున్నాడు. తన గదికి ఎదురుగావున్న గదుల్లో నలుగురైదుగురు వుంటున్నారు. అందరూ ఉద్యోగం చేసేవాళ్లే. మండువేసవి మూలాన అందరూ బైట మంచాలేసుకుని పడుక్కుంటున్నారు రాత్రిపూట. వారితోబాటే కుమార్ కూడ బైటనే పక్క వేసుకుని, కూర్చుని ఆలోచించడం మొదలుపెట్టాడు. నిరాశ జెందక తన గత జీవితాన్ని స్ఫురణకు తెచ్చుకొనేవాడు. యూరపు నుండి తిరిగి రాగానే - సనాతన సాంప్రదాయాలతో కూడిన యీ సమాజంలో తప్పకుండా తనను వెలివేస్తారని అనాడే తాను అనుకొన్నాడు. నిజంగా యీనాడు జరిగిందికూడా అంతే. మానవ దైనందిన జీవితంలో యీ కులమత విభేధాలకు స్థానం యెంత వరకు? తాను పాశ్చాత్యదేశాలకు వెళ్లిరాగానే వర్ణాశ్రమ ధర్మాలకు భంగం కలిగిందా? ఈ తన ప్రశ్నలకు సమాధానం కన్పించలేదు. నిరాశ నిస్పృహ లేకుండానే యిలా ఆలోచిస్తూ వుంటే అతడి హృదయంలో భావతరంగాలు లేకెత్తాయి. ఆ భావపరంపరలే పాటగా మారాయి. అతడు పాడడం ప్రారంభించాడు. అప్పటికి తొమ్మిదిన్నర అయింది. తను పాట ఆపుచెయ్యగానే — యెదురుగా వున్న యింట్లోంచి ఒక మధురస్వరం అతడికి వినిపించింది. వెంటనే తానుకూడ పాడటం మొదలుపెట్టాడు. ఆ పాటలోనే తన మనోభావాల్ని వివరించాడు. కాస్సేపటికి యెదరింటిలోని మధురస్వరం ఆగిపోయింది. వెంటనే అతడుకూడ ఆపుచేశాడు. ఇలా రెండు మూడు సార్లు జరిగేటప్పటికి - పదహారేళ్ల పడుచు యెదటిమేడమీద బాల్కనీలోకి వచ్చి నిలబడి హోటలువైపు చూస్తోంది. హోటలు మేడమీదకూడ లైట్లు వెలుగుతూ వుండటంవల్ల అక్కడున్న వారందరూ ఆమెకు కన్పిస్తూనే వున్నారు. కుమార్ దిండుమీద తలపెట్టుకుని పెద్దమనిషిలా ఆమెవేపు చూస్తూ పడుక్కున్నాడు. అయితే, అక్కడున్న ఆ నలుగురైదుగురిలో పాటపాడిన దెవరో ఆమెకు తెలియలేదు. తను పాట ఆపెయ్యగానే యిక్కడ యితడు కూడ మానెయ్యడంవల్ల, వాళ్లు తనను, తన పాటను అపహాస్యం చేస్తున్నారనుకుంది కాబోలు ఆమె. రౌడీ వెధవలు, మూర్ఖులు అని తిట్టి, రివ్వుమని లోపలికి వెళ్లిపోయింది. ఆమె అలా వెళ్లిపోడంచూచి నిర్వీర్యుడైనా, తనలో తానే నవ్వుకొని, "భజగోవిందం భజగోవిందం మూఢమతే" అంటూ పాడడం మొదలుపెట్టాడు కుమార్. పాటపాడుతున్నా ఆమె తిట్టిన తిట్లే అతడి చెవుల్లో గింగురుమంటున్నాయి. చటుక్కున పాట ఆపుచేసి తనలోతానే మళ్లీ నవ్వుకున్నాడు. ఆమె తిట్టిన తిట్లకు కారణాలు ప్రస్ఫుటంగా కన్పిస్తున్నాయి. ఎక్కడైతే మనస్సు కఠోరత వుంటుందో అక్కడే సున్నితహృదయం కూడా వుంటుంది. ఆమె మూర్ఖురాలు కాదు. ఆమె అన్న మాటల్లో ఒక్కటికూడ తనకు వర్తించదు. ఆ తిట్ల మరుగునుండి ఆమెలోని సిగ్గుకూడ తొంగిచూస్తోంది.

ఈ ఆలోచనలతోనే — యీ తర్కవితర్కాలతోనే - అతడు చాలసేపు గడిపాడు. రాత్రి రెండు గంటలకు నిద్రపట్టింది. అయినా, ఆ నిద్రలోకూడ ఆ యువతే యింద్రజాలంలా అతడికి కన్పిస్తోంది.

తెల్లవారింది. ఉదయకిరణాలు ముఖంమీద పడి లేచేనే కాని అతడు లేవలేదు. అతడు లేచేసరికి అప్పుడే అందరూ లేచి వెళ్లిపోయారు. ఎదురుగా మేడమీది మాధవీలత కన్పిస్తోంది. పువ్వులు యెంత అందంగా వున్నాయో! ఆ మాధవీలత మధ్యనుండి చూస్తున్న రెండు కళ్లు తన కళ్లను కలిశాయి. ఆరాత్రి ఆమె గురించి యే అభిప్రాయాన్నైతే అలవరచుకొన్నాడో ఆమె ముఖంకూడా అలాగే కన్పిస్తోంది అతడికి. ఆ ఉదయం కుమార్ ఒక్కడే ఆమె కళ్లకు కన్పించాడు. అందంగానే వున్నాడు. ఆమెకే కాదు - అందరి కళ్లకూ అతడు అందగాడే! అతడు చదివిన చదువంతా అతడి ముఖంలోనే కన్పిస్తోంది.

అతణ్ణి చూడగానే యెందుకో ఆమెకు సిగ్గేసింది. చిరునవ్వుతో కళ్లను క్రిందికి దించింది. పిల్లగాలికి మాధవీలత కదలగానే సూర్యకాంతి ఆమె ముఖంపై పడి స్పష్టంగా కన్పిస్తోంది. అతడికి కన్పించకుండా లతలచాటున దాక్కుందామని ప్రయత్నించింది గాని, యెక్కడ నిలబడ్డా అతడికి స్పష్టంగా కన్పిస్తూనే వుంది. గతరాత్రి తాను తిట్టిన తిట్లకు క్షమాపణ కోరుకుంటున్నట్లుగా చూచింది. అందుకు సానుభూతి చూపిస్తున్నట్లుగా చూచాడు అతడు. అపురూపమైన అందమైన వస్తువును అందరూ చూస్తారు. నదీ ప్రవాహం యెటుంటే అటే నీరు ప్రవహిస్తుంది. సౌందర్యమనేది యెక్కడవున్నా అందరూ తిలకిస్తూనే వుంటారు. ఏమిస్తారు, ఏం పుచ్చుకుంటారన్న ప్రశ్నేలేదు. ఇద్దరూ ఎంతసేపు అలా చూస్తూ నిలబడ్డారో వారికే తెలీదు. ఎవరి హృదయం యేమనుకుందో? వారి అభిప్రాయాలను వ్యక్తపరచుకోలేక పోయారు. ఇద్దరూ మూగజీవుల్లా యిలా చూసుకొనే సమయంలో పదిపన్నెండేళ్ల పిల్ల బైటికివచ్చి వీరిద్దరినీ చూచి నవ్వుకొంటూ పరుగెత్తుకుపోయింది. కుమార్ బాబు నవ్వుకుంటూ లోపలికి వెళ్లిపోయాడు.

## 2

చిన్నగది. అంతా పాశ్చాత్యపద్ధతిలో అలంకరించారు. ఒకప్రక్కన దోమతెర వేసిన పందిరిమంచం. రెండుప్రక్కల రెండు పెద్దపెద్ద అద్దాలు. చుట్టూ గోడకు తిలక్, రామకృష్ణపరమహంస మొదలైనవారి చిత్రాలు. చిన్నపిల్ల సోఫాలో కూర్చుని చదువుకుంటోంది. ప్రక్కనేవున్న అక్క పాఠం చెప్తోంది. అయినా మనసుమాత్రం యిక్కడ లేనట్లుగావుంది. దృష్టి చేతిలోవున్న పుస్తకంమీదికి పోవటంలేదు. పుస్తకాన్ని మూసేసి, "నీలీ, యెదురుగావున్న ఖాళీ స్థలంలోని పచ్చగడ్డి రెండు గుర్రాలు రెండురోజుల్లో తింటే ఒక్క గుర్రం యెన్నిరోజుల్లో తింటుంది?" అంది నవ్వుతూ. "ఒక్కరోజులో" అంటూ చెల్లెలు తడుముకోకుండా సమాధానమిచ్చింది. అక్కకు కోపం వచ్చి చెళ్లుమని ఒక దెబ్బవేసింది. నీలి దవడను సరిచేసుకుంటూ కోపంగావున్న అక్కముఖం చూచింది. ఆ సమయంలో దాసీవచ్చి "అన్నయ్యగారు పిలుస్తున్నారు. యామినీబాబుగారు వచ్చారు షికారు వెళ్లడానికి" అంది. నిరుపమ దాసీచెప్పేది వింటుంటే నీలి పరుగెత్తుకుని యామినీబాబు దగ్గరకు వెళ్లింది. అన్న సురేష్ యింకా డ్రెస్సు చేసుకుంటున్నాడు లోపల. యామినీబాబు దూరపు బంధువైనా ఆ యింట్లో అందరికీ బాగా తెలుసు. నిరుపమను అతడికిచ్చి పెళ్లిచెయ్యాలని నీలి తలిదండ్రుల కోర్కె. ఆ సంగతి నీలికి బాగా తెలుసు. అందువల్ల అక్కమీది కోపంకొద్దీ అతడితో చెప్పింది — "మనయింటికి యెదురుగావున్న హోటల్లో ఒకడున్నాడు. ప్రొద్దున్న వాణ్ణిచూస్తూ మేడమీద నిలబడింది అక్క. వాడు ఆ మేడమీద నిలబడి అక్కను చూస్తున్నాడు." ఆ మాటలతో యామినీబాబు తల దిమ్మెత్తిపోయింది. పాము విషంకన్న యెక్కువగా పనిచేసింది యీ మాట. అతనిలో అనేక ఆలోచనలు రేకెత్తాయి. ప్రేమ - ప్రపంచం — కళ్లెదురుగా కన్పిస్తున్నాయి.

"నాకు పాఠంచెప్తూ యేదో అడిగింది. నేను సరిగానే సమాధానం చెప్పాను. అయినా నన్ను కొట్టింది" అంది నీలి. ఆ సమయంలో నిరుపమ దాసీ దాన్ని వెంటబెట్టుకుని అక్కడికి వచ్చింది. ఆమె స్త్రీత్వంలో గౌరవాభిమానాలు ఉట్టిపడుతున్నాయి. తాను చెప్పినమాటలు అక్క విన్నదేమోనని నీలి భయపడింది. నిరుపమ నవ్వుతూ నెమ్మదిగావచ్చి నీలి చెయ్యిపట్టుకుని ఆవలతోటవైపు చూచింది. అక్క తనమాటలు వినలేదని ధైర్యం తెచ్చుకుంది. కాని, అనుమానమే. అయినా, అక్కతో స్నేహం చేసుకుంటే ఏమీ అనదు.

నీలి మాటలువిని అంతవరకు వైరాగ్యంలోవున్న యామినీబాబు నిరుపమను చూచి — రూపంతోబాటు

కళ్లల్లోకూడ యింత యిది వుందా అనుకున్నాడు. అవును. పతంగం యెప్పుడూ పతంగాన్నే నాశనం చేద్దామని చూస్తుందే తప్ప — తనగతి యేమౌతుందో ఆలోచించదు.

నిరుపమ హృదయంలో కోర్కెలు లేవని యెవరు మాత్రం చెప్పగలరు? ఆమె చూపులు చూస్తూ, మాటలు వింటుంటే అందరూ ఆమెను ప్రేమిస్తారు. అసలు తనకు ఒంట్లో బాగోలేదనే నెపంతో దాసీదాన్ని వెనక్కు పంపించివేద్దామనుకుంది. కాని అన్నగారు పిలవటంవల్ల తప్పనిసరైంది. కొద్దిక్షణాలలోనే సురేష్‌బాబు వచ్చి కారుతీసి గుమ్మంలో పెట్టాడు.

సాధారణంగా కాబోయే బావగారైన యామినీబాబును, నిరుపమను సాధ్యమైనంతవరకు యేకాంతంగా వదలిపెట్టాలనే కుతూహలంతో సురేష్‌బాబు నీలినికూడ రానిచ్చేవాడు కాదు. అయితే, తనవల్లనే నీలిని తీసుకురావడం మానేస్తున్నాడని నిరుపమ కాని, సురేష్ కాని యేమైనా అనుకుంటారేమోనన్న అభిప్రాయంతో - మొహమాటానికైనా నీలిని తీసుకు రమ్మని చెప్పేవాడు యామినీబాబు. అటువంటప్పుడు నీలిని తీసుకువెళ్లక తప్పేదికాదు. అయినా, ఆమెను తనకూడా బెట్టుకుని, వీళ్లిద్దర్నీ ఒకచోట వదలిపెట్టేవాడు సురేష్. అందువల్ల యామినీబాబు, నిరుపమల మధ్య అన్యోన్యప్రేమానురాగాలు వున్నాయనే ఆశించేవాడు. తాను పాశ్చాత్యవిద్యనభ్యసించి, ఆధునిక యుగంలో బ్రతుకుతున్నా నిరుపమ సనాతన సాంప్రదాయాలకే అలవాటుపడింది. పెద్దల నిశ్చయమే తన నిశ్చయమని ఊరుకొనేది. కాని తాను పాశ్చాత్యదేశాలు తిరిగి వచ్చినందువల్ల ఆ సాంప్రదాయాలు బాగా అలవరచుకొని నిరుపమతో సరదాగా సరససల్లాపాలతో గడుపుదామనుకొనేవాడు యామినీబాబు.

యామినీబాబు, నీలి ముందుసీట్లో డ్రైవరుప్రక్కన కూర్చున్నారు. సురేష్ వెనకసీట్లో కూర్చున్నాడు. నిరుపమ అన్నగారి ప్రక్కన కూర్చోబోతూంటే యెదురుగా హోటలుగుమ్మంలో కుమార్ కన్పించాడు. నీలి అతణ్ణిచూచి మెల్లగా యామినీబాబుతో చెప్పి కుమార్‌ను చూపింది. అతడు అటు కుమార్‌వైపు చూచి, ఇటు నిరుపమవైపు తిరగ్గానే నిరుపమ తలదించుకుని కూర్చుంది. కుమార్ చూస్తూనేవున్నాడు. కారు కదలిపోయింది. అందరూ దిగి పార్కులోకి వెళ్లారు. యామినీబాబు నీలిని తీసుకుని ప్రక్కగా వెళ్లాడు. అతడి మనసులో యెన్నో ఆలోచనలు అడ్డదిడ్డంగా ఉరకలు వేస్తున్నాయి. అతడెవరు? అతనికీ నిరుపమకు గల సంబంధమేమిటి? సమాధానం దొరకలేదు. "నీలీ, అక్క నిన్ను యేమని అడిగింది?" అన్నాడు.

"అప్పుడే మర్చిపోయారా? ఆమాత్రం జ్ఞాపకముండదూ?" అంటూ అక్కడిగిన లెక్క చెప్పింది.

"నువ్వేమన్నావు?"

"ఒకటి అన్నాను."

"అందుకే కొట్టిందా?" అన్నాడు అపహాస్యంగా. నీలికి అతడిస్వరం మాట్లాడిన పద్ధతి కొద్దిగా కఠినంగా తోచాయి. ఇంకా యేదో తనకు సహృదయంతో సానుభూతి చూపిస్తాడనుకుంది కాని యింత కఠోరంగా మాట్లాడతాడనుకోలేదు. అందువల్లనే అతడివైపు విషమదృష్టితో చూచింది. ఆక్షణంలో నీలిమీద అతడికి అసహ్యమేసింది. ఆమె భవిష్యత్తును శంకించాడు. నిరు అంటే యీమెకెంత అసహ్యం? అతడి మనసులోని భావాలు గాలిలోని మేఘాల్లాగ పరుగెత్తుతున్నాయి. ఆ మరుక్షణంలోనే అతడి మనస్సు నిరుపమవైపు లాగింది. ఆమెవైపు చూస్తున్నాడు. ఆమె మల్లెపాద దగ్గర నిలబడి ఆ పువ్వుల శోభను చూస్తూ ఆలోచిస్తోంది. ఈ ప్రకృతే వీటిని వికసింపచేస్తోందా? ఇలా వికసించిన ప్రకృతినే అవాంతరాలు, అత్యాచారాలు యెలా నాశనం చేస్తున్నాయో! ఈ స్వభావాన్నే మానవుడుకూడ నేర్చుకున్నట్లున్నాడు కాబోలు! సౌందర్యాన్ని అనుభవించే మిషతో అసలు వస్తువునే నాశనం చేస్తున్నారు.

## 3

కుమార్ చింతాక్రాంతుడై తనగదిలో కూర్చుని ఆలోచిస్తున్నాడు. ముఖం పేలవంగా వుంది. తన హృదయంపై పడిన వస్తువునే అతడు ప్రేమిస్తున్నాడు. కాని ... తనూ ఒక మానవుడే. చదువుకున్నవాడే. తనకూ వ్యక్తిత్వమనేది వుంది. అయినాకూడ సంఘంలో ప్రబలిపోయిన దురాచారాల్ని మాపలేనందుకు లోలోపల యెంతో బాధపడ్డాడు. తాను యూరపు వెళ్లకముందు తన భవిష్యజ్జీవితాన్ని గూర్చి యెన్నో కలలు కన్నాడు. కాని యిలా తన సంఘంలోనే - తనకు స్థానం లేకుండా పోతుందనుకోలేదు. తనపట్టుదలవల్లే తాను అటు సమాజానికి, యిటు తనయింటికి, నా అన్న వారందరికీ

కూడ దూరమయ్యాడు. తన పట్టుదలకు కారణం? ... అంతా అగమ్యగోచరంగా వుంది. అది అంతా యితరుల బలహీనతే అనుకొని, యెల్లాగైనా పట్టుదలతో, దీక్షతో ప్రపంచాన్ని యెదుర్కొవాలనుకొని, అందుకు తయ్యారు కావాలనుకొన్నాడు. అయితే యిప్పుడు తన భవిష్యజ్జీవితం?

గడియారం తానంతటది గంటలు కొడుతూనే వుంది. టైమెంతైందో తనకే తెలీదు. టేబులుకేసి చూచాడు. కప్పులో టీ పెట్టబడివుంది. ఎంతసేపైందో పెట్టి చల్లారిపోయింది. అయినా, ఆకలిగా వుండడం వల్ల అదే తీసుకుని త్రాగేడు. ఇంతలో నౌఖరువచ్చి తనకు వచ్చిన ఉత్తరం యిచ్చి వెళ్లాడు. అది తమ్ముడు వ్రాసినదని గ్రహించి, వెంటనే కవరుచించి సాంతంగా చదువుకున్నాడు. ఇంట్లో డబ్బులేదు. రోజు గడవడమే చాలకష్టంగా వుంది. గ్రామప్రజలు కూడ యెప్పటిలా సానుభూతి చూపడంలేదు. ఆలోచిస్తూ బట్టలు వేసుకొని బైటికివచ్చాడు కుమార్. ఏం చెయ్యాలి? వెంటనే ఒక నిశ్చయానికి వచ్చాడు.

4

సురేష్ నీలిని తీసుకుని యామినీబాబు దగ్గరకొచ్చి, "యామినీబాబూ! కారు తీసుకుని మేముద్దరం వెళ్లిపోతున్నాం. నాకు అర్జెంటు పనివుంది. మీరిద్దరూ తర్వాత నెమ్మదిగా నడిచిరండి" అని వెళ్లిపోయాడు. ఈ మాటలువిన్న నిరుపమ సిగ్గుతో మల్లెపొదవైపు చూడడం మొదలుపెట్టింది. ఆమెతో తానికి చాల సేపు హాయిగా గడపవచ్చునని యామినీబాబు ముఖం సంతోషంతో వికసించింది. సురేష్ వెళ్లిపోగానే, మల్లిపొదదగ్గర నిలబడ్డ నిరుపమ దగ్గరకొచ్చి, "నిరూ! నీ వేళ్లు మల్లెమొగ్గలకన్న సున్నితంగా వున్నాయి" అన్నాడు.

'ఊ' అంటూ, ముఖం ప్రక్కకు త్రిప్పుకొని "నీకు బాగున్నాయేమో కాని నాకుమాత్రం గబ్బిలంకాళ్లులా వున్నాయి" అంది. ఎల్లాగైనా సరే ఆమెను మాట్లాడింప చెయ్యాలనుకొని, "సరేగాని, బెంగాలీకవుల్లో యెవరు నీకిష్టం? ... రవిబాబా?"

"లేదు" అంటూ నెమ్మదిగా మల్లెమొగ్గ త్రెంపుతూ "గోపాలభాండి" అంది క్రీగంటచూస్తూ.

ఆ సమాధానం అతడికి దెబ్బకొట్టినట్లైంది. అయినా, ఆమెకు హాస్యకవులంటే యిష్టం కాబోలనుకుని తనను తానే సమాధానపర్చుకున్నాడు. అతడి మనస్సు పీకుతూనేవుంది. అసలుమాట అనేశాడు. "నిరూ, మనం యేలాంటి పవిత్ర సంబంధంతో బంధింపబడుతున్నామో నీకు తెలిసేవుండవచ్చు. ఆ సంబంధం వల్లనే మనం సుఖవంతులమౌతామని, యెన్ని అడ్డంకులొచ్చినా జీవితాలు సంతోషంగా గడపగలమనే ఆశతో వున్నాను. ఆ ఆశతోనే యెన్నో కలలు గంటున్నాను."

చాలసేపటివరకు నిరుపమ మాట్లాడలేదు. మౌనం అర్థాంగీకారమనుకుని, "ఇప్పుడు నాదగ్గర డబ్బు అసలులేదు. తనఖా వ్యవహారమొకటుంది. రిజిష్టరీ చేయించాలి. అందువల్ల ఒకసారి కాన్పూరు వెళ్లాలి" అన్నాడు.

"తనఖా అంటే? ఎవరిది?" అంటూ బైటకు నడవడం ప్రారంభించింది. యామినీబాబుకూడ వెనక నడుస్తూ, "ఎవరో రెండిళ్లు తనఖాపెట్టారు నాన్నగారు బ్రతికివుండగా. ఇప్పుడది నా నెత్తిమీదపడింది. అందువల్ల రేపు కాలేజీశలవుల్లో ఒకసారి వెళ్లివస్తాను. ఆ తనఖాపెట్టినతనికి పూర్తిగా డబ్బివ్వలేదు.... రిజిస్ట్రీకూడ ఆగిపోయింది.... అయినా, అతడు యెప్పుడో చనిపోయాడు. కాని అతడి కొడుకొకడున్నాడట" అంటూ నవ్వాడు సంతోషంగా. "అతణ్ణిగురించి యేవేవో విన్నాను విదేశాలకు వెళ్లి వచ్చాట్ట. అతణ్ణి చూడలేదనుకో. అతడి తండ్రినికూడ చూడలేదు.... ఏమో చూచేనేమో... గుర్తులేదు. నేను ఉద్యోగంకోసం యూనివర్శిటీకి వెళ్లినప్పుడు — లండన్ యూనివర్శిటీలో డి. లిట్. పాసైన ఒకతను అక్కడికి వచ్చాడు ఉద్యోగంకోసమని. అతడే యితడేమో!" అంటూ తనలో తనే నవ్వుకున్నాడు.

అతను నవ్వుకోవడం నిరుపమ గమనించి, "అంటే అతనికన్న మీరు తెలివితేటలుగలవారనా?" అంది.

ఆమాట కతడు సిగ్గుపడి, ఆమెకేసి ఒకసారి చురచుర చూసి "ఒక్క డి.లిట్. వల్లనే ఉద్యోగం దొరకదు. ఇతర విషయాలలో కూడ అర్హత, అనుభవం వుండాలి నేను ఇంగ్లీషు సాహిత్యంలో Ph.D. సంపాదించాను."

"అంటే Ph.D. వుంటేనే కాని ఉద్యోగంరాదా?"

"రాదు. పెద్దపెద్ద పొడుగాటి డిగ్రీలు వుండగానే సరికాదు. ఇతర విషయాలలోకూడ జ్ఞానమునేది సంపాదించాలి. లేకపోతే, ఆటువంటివారికి సంస్కృతి సభ్యత యేముంటాయి? నేను డాక్టరేట్ చదితి

టప్పుడు యెన్ని కార్యక్రమాల్లో పాల్గొనేవాణ్ణి! సభ్యజాతిని యెంతపైకి తీసుకువచ్చాను!! నాకు సంఘంలో గౌరవప్రతిష్ఠలున్నాయి. అయినా ఇది సువర్ణాక్షరాలతో లిఖించబడివుంది. దేశంలో బెంగాలీవాళ్లలో తప్ప యీసంస్కృతి, సభ్యత మరే ప్రాంతంలోను కన్పించదు. దేశంలో లక్షలాదిమంది Ph.D. ప్యాసవుతున్నారు. కాని, ఫలితం? డిగ్రీలను భుజాలమీద వేసుకొని మోస్తూ ఉద్యోగాలకోసం కాళ్లు అరిగేలా తిరుగుతున్నారు".

"అంటే-నీకున్న సంఘ గౌరవం వాళ్లకు లేదంటావు?"

"అని కాదు..."

"అంటే దేశంలో బెంగాలీవాళ్లే దేవతలంటావు."

"దేవతలనడంలేదు... సంస్కృతీ, సభ్యతల్లో వాళ్లు కొద్దిగా ముందు వున్నారంటాను."

అయితే, నువ్వనుకునే సంస్కృతి, సభ్యతలేని యీ ప్రాంతానికి యెందుకొచ్చావు ఉద్యోగంకోసం?

ఏం సమాధానమివ్వాలో అతడికి తెలియలేదు. "నువ్వేచూడు. ఇక్కడ ప్రొఫెసర్లు మనవాళ్లు. బారిస్టర్లు మనవాళ్లు. అంటే బెంగాలీ వాళ్లలో యెంతశక్తివుందో చూడు. బెంగాలీవాళ్లను యేవిషయంలోనూ యెవ్వరూ యెదుర్కోలేరు. ఇతర ప్రాంతాలవాళ్లు కష్టపడి శ్రమించి చదివి యెంతనేర్చుకుంటాడో - బెంగాలీవాడు చూచి నేర్చుకుంటాడు."

"అంటే - మీరు స్వానుభవంవల్ల చెప్తున్నారా? లేక యెవ్వరైనా చెప్పగా విన్నారా?"

ఆమె అభిప్రాయమేమిటో అతడి కర్థంకాలేదు. "నిరూ! ఒక్క మాట. బెంగాల్లోని గ్రామప్రజల్లో కలకత్తా చూడనివాళ్లు - ఎంతోమంది వున్నారు. కాని అందరూ ప్రపంచంలో జరిగే అన్నివిషయాలూ తెల్సుకుంటూనే వున్నారు. విని నేర్చుకుంటున్నారు. వారికి ఆ అవకాశాలు వున్నాయి. తక్కినవారికి రామాయణ భాగవతాలు తప్ప మరేంతెలుసు?"

అప్పటికే యిద్దరూ కేసరిబాగ్ దాటి వచ్చేశారు. ఆమె మరేమీ మాట్లాడకుండా వుండటంవల్ల అతడు నోరు తెరువలేకపోయాడు. అతడికి మాత్రం మాట్లాడాలనే వుంది. ఆ సమయంలో మంచి ట్వీడు పాంటు, సిల్కుచొక్కా వేసుకున్న వ్యక్తి రోడ్డుప్రక్కన కూర్చున్నాడు. బూటుపాలిష్ చేస్తున్నాడు. బాగా చదువుకున్న వానిలాగే కన్పించాడు.

"నిరూ! వాణ్ణిచూడు. కులానికి మాదిగవాడైనా బాగ చదువుకున్నట్లుగానే కన్పిస్తున్నాడు. ఉచ్ఛ వర్ణాలవారు వాణ్ణి చేరతియ్యలేదు. అందువల్ల కలాన్ని వదలిపెట్టి యీ కులవృత్తి స్వీకరించినట్లున్నాడు. మనం వాడికి సహాయంచెయ్యాలి. ఒకవేళ అతడు మాదిగవాడు కాకపోయినా యిబ్బంది లేదు. వాడొక ఆదర్శాన్ని మనయెదుట పెట్టినవాడౌతాడు", అంటూ యెదురుగా వెళ్లాడు. వెనకనే వెళ్లిన నిరుపమ అతణ్ణిచూచి ఆశ్చర్యంతో ఒక్కడుగు వెనక్కు వేసి 'మాదిగ!' అనుకుంది మనసులోనే. ఏదో ఉపకారం చేసే దృష్టితో "36 హివేట్ రోడ్డుకు రా" అని జేబులోంచి ఒక అణాతీసి అతడిముందర పడేసి, "నువ్వెవరవు?" అన్నాడు యామినీబాబు.

"ఈక్షణంలో నేను మాదిగవాణ్ణే. మీకీమాత్రం దయకలిగినందుకు కృతజ్ఞుణ్ణి. మీదగ్గర పనిచేసినప్పుడు తీసుకుంటాలెండి", అంటూ తనవడిలో పడిన అణా తిరిగి యిచ్చేశాడు.

'సరే' నంటూ యామినీబాబు ముందుకు సాగిపోయాడు.

బూటుపాలిష్ చేయించుకుందుకు కుమార్ దగ్గరికి అనేకమంది వస్తున్నారు. వచ్చేవారందరిలో ఉత్సాహం, సానుభూతి కన్పిస్తున్నాయి. దగ్గిర బాదం రంగుదొకటి, నల్ల రంగుదొకటి రెండు పాలీష్ డబ్బాలు, రెంటికీ రెండు బ్రష్షులు దగ్గరపెట్టుకుని కూర్చున్నాడు. పాలిష్ చెయ్యడానికి మిగతావాళ్లందరూ యెంత తీసుకుంటున్నారో అందులో సగమే తీసుకుంటున్నాడు కుమార్. తనదగ్గరకు వచ్చేవారిలో చాలమంది తనకు తెల్సున్నవారు. స్నేహితులుకూడ వున్నారు. "ఏమయ్యా, ఫారానికి నాలుగురూపాయలిస్తానన్నానే. అది అక్కరలేకపోయిందా? ఆఖరికి పాలిష్‌లోకి దిగింది వ్యవహారం." అన్నాడు పెద్దమనిషిలా కన్పించే ఒక పత్రికాధిపతి.

ఇక యింటికి పోదామని కుమార్ లేచేసరికి జేబు నిండా డబ్బులున్నాయి. ఆనందం పట్టలేకపోయాడు. ఇక ప్రపంచంలో యెవ్వరూ తనను నాశనం చెయ్యలేరు. తనకు తోడుగా మరొక్కరుంటే యెంత బాగుండేది? ఈ కులమత తత్వాలను కూకటివేళ్లతో పీకి పారవేశేవాళ్లం!

(సశేషము)

# హితరత్నములు

శ్రీ పోలాకి శ్రీనివాసరావు
బూరవల్లి



(గతసంచిక తరువాయి)

తన గానమె యమృతమ్మని
కను గానని గాయకుండు। కాపట్యముగా
మనమున దలచును పుడమిని
ఘన గాయకు గాంచెనేని। గాదా।
హితుడా!

పండిత మాన్యుడ ననుచును
చండాలుడు నీతిమాలి। చరియించి మహా
పండితుని గాంచినైనను
దండిగ పరిహాస మొనగ॥ దగునా?
హితుడా!

నేనే ఘన వైద్యుడ నని!
నానా తంత్రముల బన్ని॥ నానా గతులన్
నానా రోగుల జేకొని
ప్రాణములను, ధనము గుంజ। బాగా?
హితుడా!

టక్కరిగ వర్తకులు కడు
జిక్కులతో వర్తకంబు। జేయుచు ప్రజకున్
దక్కువ సామగ్రుల నిడి
యెక్కువ వెల బొందనెంచ। నెగ్గే!
హితుడా!

ధనమున శాశించియుదమ
తనయలను బలమ్ము లేని। తాతల కిడుచున్
తనివిగ బెండ్లిని సలుపుట
వనధిని బడద్రోయు నట్టి। పగిదిని హితుడా!

బెట్టుగ దిరిగెడి పెంకెలు
దిట్టల దాడులకు నోడి। తికమక బడుచున్
యట్టుడికి నట్టు లుడుకుచు
బట్టరె బలమైన పగను। బాయక,
హితుడా!

ఎనలేని మందు కొండను
వినయముగా గంగిరెద్దు। విద్దెల సలుపున్
తన పశు బల మెంతైనను
ఘన విజ్ఞానమున కోడి। గాదే? హితుడా!

అక్కఱ దీరిన వస్తువు
లక్కఱ బోనాడె నంచు నావల ద్రోయన్
అక్కఱ గలుగు నొకప్పుడు
నక్కఱకై భద్ర పరుప। నగుజుమి!
హితుడా!

అక్కఱ మాలిన వస్తువు
లక్కఱకై పేదవారి కర్పించిన చో
మక్కువ గాంతురు వారలు
జక్కని యుప యోగ మొదవు। జగతిని,
హితుడా!

వృద్ధులు నియమించిన తగు
పద్ధతుల। నతిక్రమించి। ప్రబలెడు వారిన్
సిద్ధించు గష్ట జాలము;
శ్రద్ధగ క్రమ పద్ధతులకు। జనవలె,
హితుడా!

ఇంటను గల నౌకరులను
గంటను దడి వెట్ట జేసి। గ్రాసం బీకన్!
కొంటె తనంబున జూచుట
కంటసమే గాక మేలు! గలదా? హితుడా!

నా పాటి వాడవా? నీ
వేపాటి వటంచు పరున। కెగ్గగ జూడన్
యే పాటి వాని తరమా?
యే పామే పుట్టలోన। దెట్టిదా! హితుడా!

జూదము లాడెడి వారికి
వాదులు జనియించి పెక్కు। బాధలు
కలుగున్,
వాదము లాడక జూదము
మోదముగా వీడు నపుడు। మోదము,
హితుడా!

కొండంత వారు మీరని
దండిగ ముఖస్తుతులు సలుప। ధర్మం
బగునా?
యుండెడిదుండెడి రీతిని
పండొలిచిన యటుల బలుక। భావ్యము!
హితుడా

మూరెడు, బారెడు బిరుదులు
పేరునకున్ జేర్చి కొనుట। పెద్ద తనం బా?
సారము చాలనిచో గడు
భారంబే గాని తనకు। బాగా? హితుడా!

గంగా స్నానం బాడియు
లింగార్చన సలిపి భక్తి। లీలల మెలగన్
బంగారు వంటి శీలము
భంగమ్మును జేసి తిరుగ। బాడియె?
హితుడా!

ఇతరుల తప్పులు వందలు
వెతకెడి వాడొక్క తప్పు। వెతుకడు,
తనలో

వెతికి గుణంబులు సవరణ
మతి శయమున జేయు నాత। డలఘుడు,
హితుడా!

ఇచ్ఛకము లసత్యము గల
ముచ్చటలను సలుపరాదు,। మూర్ఖల
పొందున్।

మ్రుచ్చిలుట దోషమనుచును
నిచ్చలు దలపోయు చుంట। నిగమము,
హితుడా!

ఎండయు, గాలియు, వానయు
ఖండితముగ నావి యనుచు। గాంక్షింపగ లే
కుండిన విధమున భూస్థితి
దండిగ నందజేది యనుట। ధర్మము,
హితుడా!

పెద్దలు చేసెడి తప్పులు
దిద్దుటకై తలుప బోరు, దీనుల తప్పుల్
పెద్దవిగా భావించియు
దిద్దుటకే దలచు చుంద్రు। దెలియుము,
హితుడా!

ఆరంభ శూరు లెల్లరు
ప్రారంభము జేసి కార్య। భారము
లందున్
పూరింప జాల రేక,
దూరంబై తొలగు చుంతో। దోషము,
హితుడా!

సాధకులు కార్యముల గని
సాధించెడి వఱకు వాని। జాఱవిడువకే
బాధ లవెన్ని జనించిన
సాధనకే దలచు చుంద్రు। జగతిని,
హితుడా!

తమ మానవత్వమును గని
తమ వలెపర మానవత్వ । తత్వము గనినన్
దమలోక మపుడె మరమతు
శ్రమలేకను జరుగుటకు సు । సాధ్యము,
హితుడా !

సరిగా హితములపై గుఱి
బఱపిన నవ భారతంపు । పౌరుల చెంతన్
నిగతమ సౌభాగ్యమ్ములు
గురియుచు నుండుటకు యెట్టి । కొదువా ?
హితుడా !

నీతులు పెక్కులు నేర్చిన
ఖ్యాతికి దావేమి లేదు ; । కష్టంబైనన్
నీతిని యాచరణమ్మిడి
ఖ్యాతిని బొందంగ వలయు । గాదా ?
హితుడా !

మాంగళ్యము గడియింపగ
మాంగళ్య గుణమ్ము లంది । మానితగతిలో
మాంగళ్య కార్యముల నిడ
మాంగళ్యము గలుగుచుండు । మహిలో !
హితుడా !

—(०)—

# సదాచార సూత్రములు

శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి

(గతసంచిక తరువాయి)

14. సచ్ఛీలము సముపార్జనకు ఆదర్శ పురుషులను అనుకరించడమే సాధనం.
15. సచ్చరిత్ర సద్వ్యవహారంవల్ల మానవుడు సమాజ, రాజ్యాల్లో మహాసీయుడవుతాడు.
16. సద్విషయాలను ఆచరించడంవల్ల కలిగేలాభం సద్గ్రంథం పఠనంవల్ల కలుగదు.
17. సుఖ, స్వాతంత్ర్యాలు మానవ జీవనోద్దేశాలు. వీటికోసమే అనేకసాధనలు జరుగుతున్నాయి.
18. బాల్యావస్థనుండి నిర్నియమాలను పాలించునట్టి మానవునకే సాఫల్యంకలుగుతుంది.
19. సత్సాంగత్యాన్ని జ్ఞాన సముపార్జనకు వినియోగించుకోవాలి.
20. సచ్ఛీలంతో ప్రజలకుపదేశమిచ్చి వారిని ఉన్నత స్థితిలోకి తీసుకొని వచ్చువాడే మహాపురుషుడనబడతాడు.
21. విద్యతో నమ్రత సరళత్వాలుకూడా ఉన్నచో సువర్ణంలో సుగంధం ఏర్పడినట్టుంటుంది.
22. ఇతరులను అజ్ఞానంనుండి దూరం చేయువాడే - విద్వాంసుడు.

# పిన్ని

'వాణి'



'నాన్నా! నాన్నా!' మధురమైన పసికంఠం చల్లగాలికి డాబామీద తిరుగుతూన్న ప్రకాశరావును ఆలోచనలనుంచి మేల్కొలిపింది. ఐదేళ్ల పాప చేతిలోని లిల్లీ పూలను అతనికిచ్చి కాళ్లను పెనవేసుకుంది.

'ఈ పువ్వులెక్కడివి పాపా?' పాపనెత్తుకుంటూ అడిగాడు.

'నాజడలో గులాబీలు, యీ లిల్లీపూలు ప్రక్కింటి విమల పిన్ని యిచ్చింది నాన్నా! రోజూ రమ్మని, యిస్తాననికూడ చెప్పింది,' పాప ఉత్సాహంగా తండ్రి మొహంలోకి చూచింది.

'అలాగా!' అంటూ పాపతో కబుర్లు చెప్పసాగాడు.



విమల పల్లెటూళ్లో ఛాందసకుటుంబంలో పుట్టింది. అందుచేత పదిసంవత్సరాలకే వివాహం జరిగింది. పన్నెండేళ్ల విమల ప్రపంచాన్ని కొంచెంగా అర్థం చేసుకుంటూన్న తరుణంలో పసుపుకుంకుమలకు దూరమైంది. అర్థంకాని మూగబాధలో క్రుంగిపోయింది.

కొంతకాలానికి విమల తండ్రి పరంధామయ్య కొడుకుల చదువులకోసం బస్తీకాపురం పెట్టారు. తోటిపిల్లలంతా కేరింతలు కొడుతూ పుస్తకాలు పట్టుకొని బడికి వెళ్తూంటే విమలకు సరదాగాఉండేది. చదువుకోవాలనే ఉత్సాహం ఆమెలో ఉరకలు వేసింది. చివరకు ధైర్యంచేసి తన అభిప్రాయాన్ని తల్లికి తెలియజేసింది. వీలులేదని పరంధామయ్య ఉరిమాడు. కాని విమల పట్టుదలచూచి ఒప్పుకోక తప్పలేదు. విమల అతిచురుగ్గా చదువుకోసాగింది. స్కూలు ఫైనలు మంచిమార్కులతో ప్యాసయింది. ఇంతలో హఠాత్తుగా పరంధామయ్య, భార్య వారంరోజుల వ్యత్యాసంలో మరణించారు.

విమల అన్నయ్యలు చదువుకున్నా సంస్కారం యేకోశానా లేదు. ఉద్యోగంచేసుకొని తన్ను తాను పోషించుకుందామనే విమల ఉద్దేశాన్ని తీవ్రంగా ఖండించారు. కుటుంబగౌరవానికి మచ్చవస్తుందని మూర్ఖంగా వాదించారు. ఇంటిపని యెగవేయడానికి యెత్తువేస్తూందని వదినెలు సణిగారు. తత్ఫలితంగా విమల విశ్రాంతిలేని పనికి అంకితమైంది. సంసారసౌఖ్యానికి, స్వేచ్ఛాజీవితానికి నోచుకోని తన దురదృష్టానికి కుమిలిపోయేది.

ప్రకాశరావు బ్యాంకు యేజంటు. పాపను పురిటిలోనే అతనికి అప్పజెప్పి భార్య కళ్లుమూసింది. తల్లి కాంతమ్మ ద్వితీయ వివాహం చేసుకోమని బలవంతపెట్టినా విరక్తుడై పాపను చూసుకుంటూ కాలం గడపసాగాడు.

ఆ ఊరికి క్రొత్తగా బదిలీ అయివచ్చిన ప్రకాశరావుకి విమల యింటిప్రక్కనే యిల్లు కుదిరింది.

ఒకనాటి సాయంత్రం మొక్కలకు నీళ్లుపోస్తూన్న విమల, 'పిన్నీ! నాకా పూవులియ్యవూ?' అన్న మధురస్వరం విని త్రుళ్లిపడింది. ముద్దులు మూటగట్టే ఐదేళ్లపాప నవ్వుతూ చూచింది. స్వచ్ఛమైన చనువు ఉట్టిపడే ఆ చిట్టిపాప సంబోధన ఆమెను తన్మయురాలిని చేసింది. పాపను దగ్గరకు తీసుకొని జడలో గులాబీలు పెట్టి లిల్లీపూవులిచ్చింది. పాపకు తల్లిలేదని తెలుసుకొని యెంతో బాధపడింది.

మొదటినించి విమల వదినెలతో స్నేహం చేసుకున్న కాంతమ్మకు విమలపై అకారణమైన ద్వేషం కలిగింది.



'విమల దగ్గరకు వెళ్లడానికి వీలులేదు', పాపను కసురుతున్న కాంతమ్మ కంఠస్వరంవిని ప్రకాశరావు తెల్లబోయాడు,

'పాపకు సరదాగా ఉంటే వెళ్లనియ్యి! ఎవరు ప్రేమగాపిలుస్తే వారి దగ్గిరకే వెళ్లడం పిల్లల లక్షణం కదూ!" అన్నాడు.

'దాని దగ్గరకువెళ్తే పాప బాగుపడ్డట్టే!' కాంతమ్మ యీసడించింది.

'విమలచేసిన తప్పేమిటమ్మా?' అని ఆశ్చర్యంతో ప్రశ్నించాడు.

'మొగుడుపోతే, యింట్లో పనిచేస్తూ పడియుండక

బోలెడు డబ్బు తగలబెట్టి చదివించి. ఉద్యోగం చేయటానికికూడ పూనుకోవడం యెంత సాహసమో చూడు! విప్పలాంటి కుటుంబానికి కళంకం తేవడం కాదూ?' సబంధంలేని వ్యాఖ్యానం సాగించింది శాంతమ్మ. మూఢనమ్మకాలతో, పూర్వీకంగా శాంతమ్మ మాట్లాడుతూంటే ప్రకాశరావుకి చికాకు వేసింది.

'భర్త పోయినంతమాత్రాన చాకిరీకి అంకితం కావాలనడం న్యాయం కాదమ్మా! ఉద్యోగం చేసుకోవాలని, అనుకోవడం గొప్పవిషయం. ఉద్యోగం చేయడంవలన వంశగౌరవానికి ఎన్నడూ భంగం కలగదు. అయినా పాపంటే ఆమెకు యిష్టం. వెళ్తే తప్పేముంది?' అన్నాడు. తండ్రిమాటలు విన్న పాప చెంగునగెంతుతూ వెళ్ళిపోయింది. శాంతమ్మ విసురుగా లోపలికి వెళ్ళిపోయింది.

'పిన్నీ! పిన్నీ!' అని పిలుస్తూ లోపలికివెళ్ళిన పాప జ్వరంతో మూలుగుతూన్న విమలనుచూచి నిలబడిపోయింది.

'రా పాపా!' హీనస్వరంతో అంటూ చేతులు చాచింది. పాపతల్లో పువ్వులుపెట్టి బుగ్గలు నిమిరింది.

'మందు త్రాగుతున్నావా పిన్నీ?' పాప అడిగింది. ఎన్నడూ అటువంటి ఆదరపూర్వకమైన మాటలు వినియెరుగని విమలకు ఆ మాటలు యెంతో సంతోషాన్ని కలిగించాయి.

'నేను చచ్చిపోతే నన్ను జ్ఞాపకం పెట్టుకుంటావా పాపా?' అని అడిగింది అప్రయత్నంగా.

'ఊహుఁ! నువ్వు చచ్చిపోవు పిన్నీ! మందు త్రాగితే జ్వరం తగ్గిపోతుందిగా!' అన్నది పాప.

'నేనంటే నీకెంత ప్రేమ పాపా!' అంటూ వెఱ్ఱి ఆనందంతో పాపను గుండెల కదుముకుంది. కొద్ది రోజులకే ప్రకాశరావుకి బదిలీ అయిపోయింది. పాప విమలతో చెప్పాలని ఉబలాటపడింది. కాని శాంతమ్మ వెళ్ళనీయలేదు. విమల పాపరాకకోసం నిరీక్షించి నిరాశచెందింది. టేబిలుమీద దండలుకట్టి ఉంచిన పువ్వులు వాడిపోయాయి.

♦ ♦ ♦

క్రమంగా విమల జీవితం మరీదుర్భరం కాసాగింది. పోషించడం కష్టంగా ఉన్నదని, పని సరిగా చేయడంలేదని వదినెలు సాధించసాగారు. అన్నలూ కలుగజేసుకోలేదు. విమల మనశ్శాంతిలేక విసుగెత్తిపోయింది. ధైర్యంచేసి అన్నలతో వాదించి స్నేహితురాలి సహాయంతో టీచరు ట్రైనింగులో చేరింది. పుట్టింటి తలుపులు ఆమెకు బందయిపోయాయి. కాని ఆమె విచారించలేదు. తన హృదయంలో ప్రత్యేకస్థానాన్ని ఆక్రమించుకున్న పాపను మాత్రం మర్చిపోలేకపోయింది.

♦ ♦ ♦

జీవితంలో యిక కలుసుకోము అని అనుకున్న వ్యక్తులు తటస్థపడటం జరుగుతూ ఉంటుంది. అదే విధంగా ఒకరోజున స్కూలువిడిచాక పాపను తీసుకొని వెళ్ళడానికివచ్చిన ప్రకాశరావు పాప ఒక స్త్రీచేయి పట్టుకొని రావడంచూచి విస్తుపోయాడు.

'విమలపిన్ని యిక్కడేఉంది నాన్నా! మాపంతులమ్మకూడ అయింది', ముద్దుమాటలతో పరిచయం చేసింది. విమల తలెత్తి మొదటిసారిగా ప్రకాశరావునుచూచి చేతులు జోడించింది. అతని కళ్ళలో గౌరవభావం తొణికిసలాడుతోంది. తీరని ఆవేదనను విశాలనేత్రాలతో దాచుకో ప్రయత్నిస్తున్న విమల ముఖం ప్రకాశరావును కదల్చివేసింది. తను క్రొత్తగా ట్రైనింగు అయివచ్చినట్లు, పాపను తిరిగి చూడగలగడం తనకెంతో సంతోషంగా ఉందనిచెప్పి సెలవు తీసుకుంది.

పాప యెక్కువసేపు విమలతోనే గడపసాగింది. ప్రకాశరావు ఆనందించాడు. కాని యిది శాంతమ్మకు సహించరానిదైంది.

'విమలతో పాపను తిరగనీయకు ప్రకాశం!' అన్నది ఒక రోజున.

'పాప ఆవిడను వదలి ఉండలేదు. అకారణంగా పాపను బంధించి బాధపెట్టటం నాకిష్టంలేదు,' అని చెప్పాడు.

ఒకసారి పాపకు జ్వరంవచ్చింది. వారంరోజులవరకు పాపసంగతి తెలియక విమల గాభరాపడి చివరకు బయలుదేరి వెళ్ళింది. మగతగా, నీరసంగా పడి ఉన్న పాపను చూచి నిర్ఘాంతపోయింది. విమల చల్లని స్పర్శతో పాపకళ్ళు తెరచింది. 'పిన్నీ! నన్ను వదలివెళ్ళకు!' అంటూ ఆమె ఒడిలో వాలిపోయింది. కన్నీళ్ళతో విమల పాపనునిమిరింది. వీలున్నప్పుడు విమలవచ్చి పాపదగ్గరే ఉంటూ, శుశ్రూష చేయసాగింది. శాంతమ్మ కిష్టంలేక పోయినా అడ్డు చెప్పలేక పోయింది.

టైఫాయిడ్‌తో నెలరోజులు బాధపడిన పాప విమల సంరక్షణలో వేగంగానే తేరుకుంది. అప్పటికి విమల సద్వర్తనను కొద్దిగా అర్థం చేసుకుంటున్న కాంతమ్మ లోలోన సిగ్గుపడిపోయింది. పాప మామూలుగా బడికి వెళ్లసాగింది.

ఆ నాడు పాప పుట్టినరోజు.

'నాన్నా! విమల పిన్నిని తీసుకురా!' అని మారాంచేసింది. ప్రకాశరావు బయలుదేరాడు.

గదిగుమ్మంలో నిలబడిన ప్రకాశరావు కృష్ణ విగ్రహానికి హారతినిస్తున్న విమలను తదేకంగా చూచాడు. ఏనాటినించో తెగనిసమస్య ఆక్షణంలో పరిష్కారమైనట్లు తోచింది. ప్రేమైక హృదయం కలిగిన విమల! తనభార్య అయితే మోడువారిన సంసారజీవితంలో ఆనందం చిగురిస్తుంది! ప్రకాశరావు యిక ఆగలేకపోయాడు. చటుక్కునవెళ్లి పూజ పళ్లెంలోని కుంకుమతీసి ఆమె నుదుట దిద్దాడు. విమల తెల్లబోయింది. మరుక్షణం వెక్కి వెక్కి యేడవ సాగింది.

'ప్రకాశరావుగారూ! మీరూ నన్ను అవమానం చేయాలని చూస్తున్నారా?' అన్నది గద్గదస్వరంతో. కుంకుమ చెరుపుకోబోతున్న విమలను ప్రకాశరావు వారించి చేయి పట్టుకున్నాడు.

'జీవితాంతం బాధతో కృశించడానికి నీవుచేసిన అపరాధమేమీ లేదు విమలా! అన్ని సౌఖ్యాలకు నీవూ అర్హురాలివే. నీపసితనంలో పెద్దలు చేసిన తప్పుకి నీవు శిక్షితురాలివి కానవసరంలేదు. పాప హృదయం నీకు తెలిసినదే! పాపకోసమైనా నాదానవు అయి నా యింట్లో సంతోషాన్ని నెలకొల్పాలని నా ఆశయం. నీకిష్టంలేదా విమలా?' ప్రకాశరావు దీన స్వరం విమలను ద్రవింపజేసింది. తన జీవితం సఫలమయే శుభదినం వచ్చిందా? కాని కాంతమ్మకు తన యెడలగల కోపాన్ని తల్చుకొని కంపించింది.

'లోకంద్రుష్టిలో సమంజసంగా ఉండదు ప్రకాశరావుగారూ! మీ అమ్మగారికి వ్యతిరేకంగా ప్రవర్తించడం భావ్యంకాదు', అన్నది.

'నాయిష్టానికి మా అమ్మ అడ్డం చెప్పదు. నీకు అంగీకారమైతే నాకెవరి లక్ష్యమూలేదు. లోకం కోసం నాపాపను అన్యాయం చేయను' అన్నాడు.

'ధన్యురాలిని', విమల పెదవులపై మందహాసం లాస్యంచేసింది. కుంకుమతో మెరుగులీనే ఆమె అందమైన ముఖంచూస్తూ ప్రకాశరావు తన్మయుడైనాడు.

రిజిస్ట్రారు ఆఫీసునించి యిద్దరూ యింట్లో అడుగు పెట్టేసరికి పాప నవ్వుతూ యెదురుగా వచ్చింది.

'నీకు పుట్టినరోజు బహుమతిగా పిన్నిని తీసుకొచ్చాను పాపా! ఇకమీదట పిన్ని మనయింట్లోనే ఉండిపోతుంది'. అన్నాడు ప్రకాశరావు. భక్తితో తన పాదాలకు నమస్కరిస్తున్న దంపతులను దీవించకుండా ఉండలేకపోయింది కాంతమ్మ.

విమల భుజాలపై చేతులువేసి కూర్చుని కిలకిల నవ్వుతూ కబుర్లుచెప్తూన్న పాపను, చిరునవ్వులు చిందిస్తున్న విమలనుచూస్తూ ప్రకాశరావు ఆనందభరితుడైనాడు.

# సిరిసిరిమువ్వలు

రోడ్డుమీద బియ్యం బస్తాలతో నిండి యున్న బండిని యిద్దరు మనుష్యులు లాగుకొని పోతుంటే, ఒక దొంగ వెనుక బస్తాలలోని బియ్యమును కార్చుకొని దొంగిలిస్తుంటాడు. అది చూచి పోలీసు "ఏయ్! దొంగ వెధవా బియ్యందొంగిలిస్తున్నావా? ఉండు!" అని గదమాయించాడు.

"దొంగిలించటంలేదండీ – పాపం బండి లాగలేకలాగుతున్న పిల్ల బరువు తగ్గించ సహాయపడుతున్నాను" అన్నాడు దొంగ వెనుకడుగేస్తూ

♦ ♦ ♦

ఒకాయన సైకిలుమీద పోతూ పరాకుగా యున్న ఒకాయనతో "ఏమండీ! యిక్కడెక్కడనో లైసెన్సులేని సైకిళ్లను పట్టుకుంటూన్నారట ఎక్కడండీ!" అనడిగాడు.

నూతనవ్యక్తి "అయితే యీసైకిలుకు లైసెన్సులేదన్నమాట"

"అందుకనేకదండీ మిమ్ములనడుగటం" అన్నాడు ఎదటివ్యక్తి యిన్స్పెక్టరని తెలియక

"అలాగా! – అయితే దిగు – సైకిలు ఆషెడ్‌లో పెట్టు" అన్నాడు యిన్స్పెక్టరు.

♦ ♦ ♦

ఏమోయ్! అర్జునుడికి, రాముడికి యుద్ధం జరిగింది తెలుసా?"

"తెలియదండీ!"

"హనుమంతుడు అర్జుని పార్టీలో చేరి రాముని వీకనులిమేశాడు"

"అలాగా!!"

♦ ♦ ♦

ఇద్దరు కూలివాళ్లు యిల్లు కప్పుతూ అందులో నొకడు

"నేనెవరనుకున్నావు రా గయ్యా! ఒకప్పుడు విజయనగర సంస్థానంనాదే!" అన్నాడు.

"అలాగా! మరియిప్పుడు పెంకులు తీసి కప్పుతున్నావేమిటి?"

"అదేంలేదు! అవసరమొచ్చింది. కాబట్టి యీ పనిచేస్తున్నాను.

♦ ♦ ♦

ఒకాయన బస్సులోని తోడి ప్రయాణీకుని "ఏమండీ! యీ బస్సు ఆనకట్టమీదుగా వెళుతుందికదండీ!" అడిగాడు.

"అదేమిటండీ అలాగడుగుతారు! పోయితీరాలి; లేకపోతే గోదావరిలో పడిపోదూ!" అన్నాడు మరొకాయన.

C. H. రామకృష్ణరాజు

ఇద్దరు మిత్రులు ఎగతాళిగా మాట్లాడుకుంటూ అందులో నొకడు "నిన్ననాకొక కలవచ్చింది. అందులో మనమిద్దరం కలసి పోతూయుండగా నేను ఒక నేతిగోతిలోను, నివుమురికి నీటిగోతిలోను పడినట్లు చూచాను" అన్నాడు.

"నాకూ అలాంటి కలే వచ్చింది కాని గోతులలోనుండి బయటికివచ్చిన తరువాత నీవీపునేను నావీపు నీవు నాకినట్లు చూచాను" అన్నాడు మరొకడు.

బొడ్డుపల్లి వెంకటప్పయ్యశర్మ

# మంచీ — చెడు

శ్రీ ధాయిపులె బాలకృష్ణరావు

ప్రియాతి ప్రియమైన రాణి,

మధురాతి మధురమైన క్షణాలకోసం వేచుకొని వున్నాను. హృదయ గవాక్షంలో ఆశాజ్యోతులు వెలిగాయి. కూని రాగాలతో నాలో యెవరో ప్రణయ గీతాలు పాడుతున్నారు. ఆ గీతాలాపనలో మేళవించి పోయాను. అప్రయత్నంగ నేనూ శ్రుతి కలిపాను.

అచంచలమైన చిరకాల తపస్సు ఫలించింది. అవ్యాజమైన ప్రేమానురాగాలతో ప్రణయ కుసుమాల్ని ఒకరికొకరం అందజేసుకున్నాం. ప్రేమాతిశయాలతో నిర్దుష్టమైన ప్రేమతీగెలు పెన వేసుకబోతున్నాయి. నామనోరధము నెఱవేరింది. నా జీవిత గమనాని కిది పునాది.

జీవితమధువును గ్రోలడానికి యింక నాకెంతో కాలం లేదు. హృదయాంగణ పరిధుల్లో విహరిస్తూ నాలో నాకోసం నిరీక్షిస్తున్నందున, తనువంతా మన్మధని శాంత బాణములకు గురిఅయింది. నన్నెవరో స్పర్శించినట్లుంది. నిజాన్ని దాచిపెట్టక వ్రాస్తుంటే నాకెందుకో ఒళ్ళంతా పులకరించినట్లుంది.

రవి అంతగా నీకు తెలియదనుకుంటాను. ఛా! ఎంత మతిమరపు. ఒకసారి నీకు పరిచయం గూడ చేశాననుకుంటాను. ఒకవేళ అతను నీకు జ్ఞాపకంలేక పోతే ఆయనెలావుంటాడో, పరిచయంచేసిన రోజెలా వున్నాడో జ్ఞప్తికి తెచ్చేందుకు వ్రాస్తున్నాను. చిలిపిగా వ్రాస్తున్నానని నవ్వుతున్నావుకదూ! నేను వ్రాసే మాటలన్నీ చిలిపిగా వుంటాయిలే! ...?... ఆయన్ను వర్ణించాలంటే నాకెంతో సిగ్గుగావుంది. నా ముందున్నట్లు భ్రమిస్తున్నా. ఎందుకోమరి! ఆయన్నుగూర్చి చెప్పాలన్నా గాని, చూడాలన్నా గాని గిలిగింతలు పెట్టినట్లవుతుంది. ఏదోమరి కళ్ళుమూసుకొని వ్రాసేస్తున్నాను. మనిషి గోధమవర్ణం. నూనూగు మీసాలు, గుండ్రముగా వుండే వదనము. అందంగా ఇనక్కి దువ్విన క్రాపు మీద నూత్నటగవుంటాడు. నువ్వు మా వూరికి వచ్చినపుడు, మనమిద్దరము కలిసి సినిమాకు వెళుతుంటే మిత్రాలోడులో లాల్చి పంచ కట్టిన వ్యక్తిని పరిచయం చేసానే ఆవ్యక్తే పైన వర్ణించిన, కాబోతున్న ... ...

రాణి! రవిని నేను ప్రేమించాను. అతనికంటే అతని మంచి స్వభావాన్ని యింకా యెక్కువగ ప్రేమించాను. హృదయ పూర్వకముగ ప్రేమించాను. రవినన్నర్థం చేసికున్నాడు. అందుకే ఆనాడు ... అబ్బ ఎందుకో సిగ్గు ... తనతో భాగస్వరాలుగ కావలని కోరాడు. అందుకు నా మనస్సు నిరాకరించలేదు.

అతనిలో నేను విశ్వాసము కోల్పోకుండవుండటానికి కారణం లేకపోలేదు. అది అతని శుద్ధమైన స్వభావమే. నిష్కళంకమైన ప్రేమ తత్వాన్ని తెలియని వాళ్లు ఆచరించినట్లు అనుకరించకుండ వుండడము.

ఆ రోజు చీకటి దట్టముగ అలుముకొనివుంది. మనకాలేజిలో సమీరసమితి బృందమువాళ్లు వేసిన నాటకాన్ని మాసి తిరిగి వస్తున్నాను - స్నేహితురాళ్ళతో కలిసి. మా గుంపులో నువ్వుగూడవున్నావనుకుంటాను. అవునవును_నువ్వూవున్నావు. నీవేదో ఛలోక్తిగ ఒకమాట చెబితే అందరూ ఫక్కున నవ్వాము. జ్ఞాపకముందా? డిస్పెర్సు రోడ్డు వద్ద అందరు విడిపోయి యెవరింటికి వాళ్లుబయలు దేరాము. అమావాస్యరాత్రేమో! తమస్సు దట్టముగ వుంది. మాయింటిని నేను చేరాలంటే నేనింక ఒక ఫర్లాంగు దూరము నడువాల్సి వుంది. వీధిగుండా పోవాలి. ఆ వీధి చాల మెలికలు తిరిగి వుంది. చిన్న చిన్న సందులున్నాయ్. ఆ సందులలో చూశామంటే చాల భయమేస్తుంది. అవి రౌడీలకు దొంగలకు మంచి అవకాశాన్ని కల్పించే ప్రదేశాలని మా నాన్న చెప్పంగ విన్నాను. అందుకే భయాందోళనలతో గుండెను గుప్పెట్లో పెట్టుకొని వడివడిగ అడుగులు వేస్తూ పోతున్నాను. ఎందుకో ఒకసారి తిరి

చూడాలనిపించింది. రౌడీలెవ్వరైన వెంటాడుతున్నారేమోనని బెదురుగా వెనుతిరిగి చూశాను. నేను స్తంభించిపోయాను. నా భయమింక వర్ణనాతీతము. నావేపు ఏదో ఆకారము వస్తున్నదని గ్రహించాను. కాళ్ళు, చేతులు వణికి పోయాయి. త్వరత్వరగ అడుగులు వేస్తూపోయాను. సందుమలుపులో మునిసిపాలిటి గుడ్డిదీపము వెలుగుతోంది. ఆసందు తిరుగుతూనే నాలుగవ యిల్లు మాది. బ్రతికేనురా దేవుడా అనుకున్నాను. దీపపు స్తంభము దగ్గర నిలబడి తిరిగి చూశాను. రాను, రాను ఆ ఆకార స్వరూపము ఎవరో గ్రహించాను. ఆవ్యక్తి మామూలుగనే నడుస్తున్నాడు. సమీపిస్తూనే నాకళ్ళను నేనె నమ్మలేక పోయాను. రవి నన్ను అనుసరిస్తున్నాడు.

నాకెందుతో అతనిపై ఘుదట్లో అనుమానం కలిగింది. అతను నమస్కారము చేయకముందే నేను నమస్కరించాను. "గుడ్ నైట్ ప్రమీల!" అతను ప్రతి నమస్కారము చేస్తూ చెప్పాడు. నేను మూగబోయి నిలిచాను. అతను అందుకున్నాడు.

"ప్రమీలా! రోజులు చాల సున్నితంగవున్నాయ్ చూసి మసలుకోవాలి. అమ్మాయిలు రాత్రిపూట ఒంటరిగ తిరగడం మంచిదికాదు. అందుకే మీ వెంటరావడం. మీరు మరోవిధముగ అనుకోకుంటే కృతజ్ఞున్ని ... వస్తాను." తిరిగి వెళ్ళబోయాడు. అతను నిర్భయముగ, నిస్సంశయముగ చెప్పాడు. దాన్ని జ్ఞానోపదేశముగ తీసుకున్నాను.

"క్షమించండి ఇకమీదట ఒంటరిగ తిరగను" అన్నాను, "ఇంక మీయిల్లు దగ్గరే అనుకుంటాను. సెలవు", వెళ్ళిపోయాడు. అతన్ని మనస్సులో అభినందించుకున్నాను.

ఇలాగ నన్నెన్నోసార్లు జ్ఞాన బోధ చేశాడు. ఏ విషయము చెప్పాలన్నా గాని ఫ్రాంకుగ చెప్పేవాడు. అతని గొప్పగుణాల్లో అది ఒక లక్షణము!

రవిని పెళ్ళి చేసికోడం నిజంగా నా అదృష్టం అనుకోవాల్సిందే. శుభలేఖలు ప్రింటుకు పోయాయ్. ఇంటిలో అందరికీ చేతినిండా పనులే. వివాహము యింకా ఐదారు రోజులున్నయ్.

శుభలేఖ పంపకముందు వ్రాస్తున్న యీ లేఖను చూసి ఉపోద్ఘాత మనుకుంటున్నావేమో. ఈ ఉపోద్ఘాతము కనీసము నాప్రియమైన రాణికి తెలియకుంటే, నామనస్సు నన్ను బాధపెడుతుంది. మురోకల్లకైతే యిదంతా వ్రాయకపోదునేమో!

నా పెళ్ళికి నీవు తప్పకుండ రావాలి సుమా! హృదయం ఆహ్లాదకరంగ వుంది. ఎందుకో...?

ఇట్లు,
నీ ప్రియస్నేహితురాలు
ప్రమీల.

మీరారాణి ప్రమీల వుత్తరం చదివింది. ఆమె కనుకొలంకులపై కన్నీటితెరలు క్రమ్మాయి. బుగ్గలపై చారికలు యేర్పడ్డాయి.

మరోకసారి వుత్తరం చదువడం ప్రారంభించింది. సగమువరకు చదివి, యింక చదువలేక హృదయ భారముతో క్రుంగిపోయింది. ఉత్తరములోని ప్రతి అక్షరము తనను వెక్కిరిస్తున్నయ్. అందులోని మాటలు శూలాలై తన హృదయాన్ని గాయపరుస్తున్నాయ్. బాధతో మీరారాణి మనసు వికలమైపోయింది.

మీరారాణి ఆ పడుచుతనాన్ని పటాపంచలు చేసింది. జీవితపు విలువలు తెలియక, క్షణికానందం కోసం తన వయసును, యవ్వనాన్ని విచ్ఛిన్నం చేసుకుంది. ప్రియులను బానిసలుగ చేసికున్నా, సంఘంలోని నారీలోకం ముందు నిర్భయంగ నిలబడేందుకు ఏముఖంతో నిలబడుతుంది? రసికుల వెచ్చటి కౌగిటిలో స్వర్గానందాన్ని అనుభవించేంతవరకు, తనకు బయటి ప్రపంచంతో పనిలేదనుకుంది. మీరారాణి తాత్కాలికానందానికి బానిసగా తయారైంది.

చేతులు కాల్చుకుంది. కాల్చుకున్న తర్వాత దుఃఖిస్తే వచ్చేదేమీ లేదు. ఒకవేళ కాల్పుఫలితము పుండు మాయమయినా, మచ్చలు మాయంకావు. మునుగులేని యీ సత్యాన్ని మరచిపోయింది మీరారాణి.

జీవిత లోతుపాతులను చవిచూడాలని కాలాన్ని ముందుకునెట్టి, ఆత్మాభిమానాన్ని, వ్యక్తిత్వాన్ని కాలదన్ని పశుకామునికి లొంగి మానాభిమానాల్ని మంటగలుపుకుంటారు. నలుగురిలో తలెత్తకుండ తిరుగుతు, కుమిలి కృశించిపోతారు, బ్రతుకుతూ చస్తున్న బాధను అనుభవిస్తారు. తప్పటడుగు పర్యవసాన మిదిగదాయని స్మృతిపథంలో మెదలగ కన్నీళ్ళు కారుస్తారు. జీవితపరమార్థము తెలియకుండ, వాని నైతికవిలువల్ని విస్మరించి మాయని మచ్చలను ఆహ్వానిస్తే కలకాలం జీవితం దుర్భరమైపోతుంది. బాధామయ జీవితాన్ని అనుభవించాలి.

అందుకే ప్రమీల వ్రాసినవుత్తరం మీరారాణి

హృదయాన్ని గాయపరచింది. బంగారంలాంటి మీరా జీవితాన్ని పాడుచేసుకుంది.

"ప్రమీల పెండ్లికి తను ఏవిధంగ, ఏముఖంతో వెళ్ళేది? పాపిష్టి యీశరీరాన్ని అక్కడికి మోసుక వెళ్ళడం ఎందుకు? అక్కడుండేవాళ్ళు తనను ఏ విధంగా చూస్తారో! ఎలా పలకరిస్తారో!" యీ సమస్యలతో సతమతమాతూ పోగూడదనే నిశ్చయానికి వచ్చింది.

పెండ్లిముచ్చటను చూసి ఆనందించేభాగ్యం లభించినా, సద్వినియోగ పరచుకో లేకపోయింది. దివ్యముగ జరిగే వైభవాన్ని కళ్ళారచూసి సంతోషించే అవకాశాన్ని జారవిడుచుకుంది మీరా. అంతకంటే ముఖ్యమైనదీ – తన స్నేహితురాలు ప్రమీలను ఆ పెండ్లి ముచ్చటల్లో చూడలేకపోయింది.

కాలచక్రముతో రోజులు, నెలలు దొర్లిపోయాయ్.

పోస్టుమాన్ పిలుపుతో కమ్మని సంసారాన్ని సాగిస్తున్న ప్రమీల గుమ్మందగ్గిరికి వెళ్ళి కవరును అందుకొంది. ఎవరివద్దనుండి వచ్చిందో వూహించుకోలేని ప్రమీల కొంచెం ఆశ్చర్యంతోనే కవరుచింపి, ఉత్తరం మడతలను విప్పింది.

గవర్న మెంటు ఆస్పత్రి,
అమలాపురం.

ప్రియమైన ప్రమీల,

మీరిద్దరూ చిలుకాగోరింకల్లా గడుపాలని దీవిస్తూ మీరారాణి వ్రాసిన వుత్తరం.

నీ పెళ్ళికి రానందుకు చాల విచారించాను. నన్ను క్షమించేది.

నేను హాస్పిటల్లో చేరి మూడురోజులైంది. ఈ రోజు ఆపరేషన్. ఆపరేషన్ జరిగే ఒకగంటముందే యీ వుత్తరం వ్రాస్తున్నాను. కడుపులో బల్ల కావడంవల్ల నా పరిస్థితి చాల సీరియస్‌గ వుంది. నీవు కంగారుపడవద్దు.

పాపాలకు ప్రతిఫలంగా నా ఖర్మను నేను అనుభవిస్తున్నాను. దీనినుండి నన్నెవరు తప్పించలేరు.

ఈ విశాలప్రపంచంలో నాకుండే విలువ యెప్పుడో కోల్పోయాను. నేను నీకు స్నేహితురాలిగ వుండి యింత ఘనమైన సిగ్గుచేటుగల సర్టిఫికేటును గడించినందుకు నన్ను క్షమించేది.

జీవిత విలువను తెలిసికోలేకపోయాను.

ఇట్లు,
నీ అభాగ్యురాలు.
మీరారాణి.

ప్రమీల కనుగుడ్లలో నీళ్ళునిండాయి.

---




"చదలవాడ"

పెద్దలైన వారు పెడత్రోవఁ ద్రొక్కినఁ
జిన్నవార లట్లు చేయరాదు
ఇట్టి నేఁటి ధర్మ మెఱిఁగింపరా చాటి
విశ్వదాభిరామ! వినుర వేమ!

కాటకమునఁ గల్గు కడగండ్లలోఁ జిక్కి
కటికి బీద వార లటమటింప
షదవి నున్న వారు కదలరు - మెదలరు
విశ్వదాభిరామ! వినుర వేమ!

చౌక కొట్టు లిపుడు సాగింతు రనుకొంట
నీటి మూటయయ్యె - పాటిఁ దప్పె
''ఓటు'' నాఁటి మాట ఓటిది యీపూఁట
విశ్వదాభిరామ! వినుర వేమ!

కూడు - గుడ్డ లేక, గోడు గోడున నేడ్చి
గుడిసెలోనె క్రుంగి, కూలుచుండు
పేదవారిఁ గాంచి ప్రేమించువా రేరి?
విశ్వదాభిరామ! వినుర వేమ!

గింజ విలువ పెరుఁగ గంజియే గంటెఁడు
లేని వాఁడు బ్రతుక లేఁడు నేఁడు
ఉన్నవార లిద్ది యూహింప రెన్నఁడు
విశ్వదాభిరామ! వినుర వేమ!

ఉన్న వార లిత్తురన్న పేరాసతోఁ
జూచి పేదవారు సుక్కుచుంద్రు
కడుపుమంట నార్పఁ గలరె? బొజ్జయ్యలు
విశ్వదాభిరామ! వినుర వేమ!

చేయఁ బనులు లేవు; చేత పైసా లేదు
బక్క డొక్క నిండ దొక్కపూఁట
అకట! బీదవాని అగచాట్లు చూడరా
విశ్వదాభిరామ! వినుర వేమ!

నౌకరులకు వేతనమ్ముఁ బెంచిన నేమి?
మిగత వారు మిగుల మిడుకు చుండ
సరకు విలువ తగ్గ సౌఖ్య మందఱ కగు
విశ్వదాభిరామ! వినుర వేమ!

తిండి మెక్కి, మేడనుండి డిగ్గని మొండి
సంపదను గుఱించి సన్నుతించి
కలముఁ జెఱచుకొంద్రు కాకవ్వ గొండఱు
విశ్వదాభిరామ! వినుర వేమ?

పక్షపాత రహిత పాలనా రత నేత
భరతమాత సతముఁ బడయుఁ గాత!
శ్రీకి నిలయ మాంధ్ర సీమయే యాఁగాత!
విశ్వదాభిరామ! వినుర వేమ!

# టిబెట్టు - రాకుమారి వెన్ చెంగ్

శ్రీ టుంగ్ చిన్-హువా



ఏడవ శతాబ్దంలో టిబెట్టురాజు స్రోన్ త్సన్ గంపోకు టాంగ్ రాజవంశానికి చెందిన రాకుమారి వెన్ చెంగ్ ను ఇచ్చి వివాహం చేసినప్పుడు చైనీస్ సిల్కు గుడ్డల్ని 'అద్దు' కాగితాన్నీ సిరా తయారు చేసే ప్రవీణులను వ్యవసాయ ప్రవీణులను రాకుమారికి అరణంగా ఇచ్చి పంపించడం జరిగింది. చారిత్రాత్మకమైన యీ కలయిక హాన్ జాతీయులకూ టిబెట్ ప్రజలకూ మధ్య స్నేహసంబంధాలను బలపర్చింది టిబెట్ ఆర్థికవిధానంపైనా, సంస్కృతిపైనా గొప్ప ప్రభావాన్ని కలుగజేసింది.

రాజవంశాల మధ్య యేర్పడిన యీ కలయికను గురించి టిబెట్ ప్రజలు నేటికీగూడా యెన్నెన్నో కథలను చెప్పుకొంటుంటారు. స్రోన్ త్సన్ గంపో తన భార్య గౌరవార్థం లాసానగర మధ్యస్థంలో జోఖాన్ ఆరామాన్ని నిర్మించాడు. బహుసుందరమైన యీ కట్టడం చాలా ప్రఖ్యాతిని గాంచింది. స్రోన్ త్సన్ గంపో బలవంతుడైన రాజు. తన రాజ్యాన్ని చక్కగా పాలిస్తుండేవాడు. తన దేశంలోని వివిధ తెగలను ఒకేజాతిగా ఐక్యపర్చి, తర్వాత టాంగ్ రాజవంశంతో వియ్యంపొందాడు. చైనాదేశ మహా నాగరకతను సంతరించుకొన్నాడు.

ఈ టిబెటియన్ రాజు నూనూగు మీసాల నూత్నయౌవనంలో ఉండగా చైనా దేశపు తైట్సుంగ్ మహారాజు సోదరుని కుమార్తెయొక్క ముగ్ధసౌందర్యాన్ని గురించి విన్నాడు. ఆమెను పరిణయమాడాలని యెందరెందరో రాజులు ప్రయత్నించారు. కాని చైనీస్ మహారాజు ఆమెను అత్యంత ప్రతిభావంతుడు వివేకవంతుడు అయిన వానికేఇచ్చి వివాహం చేస్తానని ప్రకటించాడు. కాని టిబెటియన్ రాజు యే మాత్రము వెనుకాడకుండా తన మంత్రి గువెర్ కు వందమంది యోధులను తోడుగాయిచ్చి చైనీస్ మహారాజుకు తన ఆకాంక్షను తెలియజేయను పంపించాడు. గువెర్ తన వెంట ముత్యాలు, వజ్రాలు, బంగారం మొదలైనా విలువగల వస్తువులను కానుకలుగా పట్టుకొని బయలుదేరాడు.

గువెర్, అతని అనుచరులు యెన్నెన్నో కష్టాలను యెదుర్కొని చిట్టచివరికి చైనారాజధాని చాంగన్ కు చేరుకొన్నారు. ఇటువంటి సందేశాలలోనే మరి నాలుగు రాయబారవర్గాలువచ్చి అప్పటికే రాజధానిలో ఉన్నాయి. అందువల్ల తైట్సుంగ్ మహారాజువచ్చిన ఐదుగురు రాయబారుల మధ్య పరీక్ష పెడతాననీ, అందులోకి తెలివైన రాయబారి యజమానికే రాకుమారి వెన్ చెంగ్ ను ఇచ్చి వివాహంచేస్తాననీ అన్నాడు.

మహారాజు వంకరటింకరగా మధ్య రంధ్రంఉన్న గుండురాయంత ముత్యాన్నొకదానిని తెప్పించి అందులో దారం యెక్కించమన్నాడు. మొదటి నలుగురూ దారం యెక్కించలేకపోయారు. తర్వాత గువెర్ వంతు వచ్చింది. గువెర్ ఒక చీమను తీసుకొని వచ్చి దాని నడుముకు దారాన్ని కట్టాడు. అలా దారాన్నికట్టిన చీమను ముత్యపు రంధ్రంలో ఉంచి మూడుసార్లు నోటితో ఊదాడు. చీమ నెమ్మదిగా రంధ్రంగుండా ప్రాకుకొంటూ రెండవవైపునుండి దారంతో సహావచ్చింది.

తర్వాత మహారాజు వంద ఆడు గుఱ్ఱాలను వాటి దూడలతో సహా తెప్పించాడు. గుఱ్ఱాలనుండి వాటి దూడలను వేరుచేయించి, ఏయేదూడలు ఏయేగుఱ్ఱాలవో కనిపెట్టమని ఆ ఐదుగురు రాయబారులనూ కోరాడు. మొదటి నలుగురు రాయబారులు గుఱ్ఱాల రంగులనూ, లక్షణాలనూ, దూడల రంగులనూ, లక్షణాలను యెంతో శ్రద్ధగా పరిశీలించిచూస్తూ ఏయే దూడలు ఏయే గుఱ్ఱాలవో కనిపెట్టడానికి విశ్వప్రయత్నాలు చేసారు. కాని యేమీ లాభంలేకపోయింది. ఇలా వాళ్లు ప్రయత్నిస్తున్న సమయంలో గువెర్ వెళ్ళి గుఱ్ఱాల కాపరితో బాతాఖానీ ప్రారంభించాడు. గుఱ్ఱాల కాపరి గువెర్ నిరాడంబరత్వానికి చాలా సంతోషపడి అతనికి ఒక చిన్న సలహాను ఇచ్చాడు. ఇలా సలహానుపొందిన గువెర్ తనవంతు వచ్చినప్పుడు ఆరాత్రికి గుఱ్ఱపుదూడలనన్నింటినీ వేరుగా కట్టివేసి పొడి శనగలను మాత్రమే వాటికి పెట్టి, నీటిని ఒక్కచుక్కయినా త్రాగనివ్వవద్దన్నాడు. మర్నాడు ఉదయమే ఆ గుఱ్ఱపుదూడలను విప్పేటప్పటికి ఏగుఱ్ఱపుదూడలు ఆ గుఱ్ఱందగ్గరకు చేరుకొని పాలుకుడవసాగాయి.

ఇలా మొదటి రెండు సమస్యలను ఒక్క గువెర్ మాత్రమే తీర్చగలిగాడు. తర్వాత చివరిపరీక్ష వచ్చింది. మహారాజు రాకుమారి వెన్ చెంగ్‌తో పాటు ఆమె చెలికత్తెలను రెండువందల యాభై మందిని రాకుమారిలాగే ఒకేవిధమైన దుస్తులు, ఒకే విధమైన నగలతో అలంకరింపచేసాడు. ఆసుందరాంగులలో రాకుమారి యెవరో కనిపెట్టమని మహారాజు రాయబారులను అడిగాడు. ఎంతపరీక్షగా చూచినా ఆసుందరాంగులలో రాకుమారి యెవరో కనిపెట్టడం గువెర్‌కుగూడా చాలా కష్టమయిపోయింది. అప్పుడు గువెర్‌కు తాను విడిదిచేసిన గృహయజమాని భార్య ఒకప్పుడు రాకుమారికి చెలికత్తెగా పనిచేసిందన్న విషయం జ్ఞాపకానికివచ్చింది. గువెర్ ఆమె సహాయాన్ని అర్థించాడు. స్రోన్ట్సన్ గంపో సద్గుణాలను గురించి వినిఉన్న ఆమె రాకుమారిని యెలా గుర్తించాలో తెలియజేసింది. గువెర్ రాజభవనానికివెళ్లి ఆ సుందరాంగులలో ఒకతెను రాకుమారిగా గుర్తించాడు. ఆమె ఎడమబుగ్గపైన ఒక మచ్చ గుర్తు, కుడిబుగ్గపైన ఒక పద్మంగుర్తు ఉన్నాయి. నొసటి మధ్య ఒక ఎర్రనిచుక్క, దానిలో ఒక సూక్ష్మమైన బుద్ధుని విగ్రహము అగుపడ్డాయి. ఆమే రాకుమారి.

టిబెట్ రాజు తన రాయబారిని యెన్నుకొనడంలో యెంతటి వివేకాన్ని చూపాడో గువెర్ తెలివితేటలవల్ల మహారాజుకు రుజువయింది. రాకుమారి వెన్ చెంగ్‌ను టిబెట్‌కు సాగనంపడానికి యేర్పాట్లను చేయమని తైట్సుంగ్ మహారాజు ఆజ్ఞాపించాడు. గృహోపకరణ వస్తువులు, విలువైన మూలికలు, ఖనిజాలు, చైనీస్ మహాకావ్యాలు, చరిత్రగ్రంథాలు, వివిధ రకాల వాద్యాలు, వరి, గోధుమ మొక్కలు, పట్టుపురుగుల గుడ్లు, సుందరమైన ఒక బుద్ధవిగ్రహము రాకుమారికి అరణంగా టిబెట్‌కు పంపించబడ్డాయి. అనేకమంది సేవకులు, చేతిపనుల ప్రవీణులుగూడా వెంట పంపించబడ్డారు.

లాసాకు చేరుకున్న తర్వాత రాకుమారి వెన్ చెంగ్‌కూ స్రోన్ట్సన్ గంపోకు క్రీ॥ శ॥ 641 లో వైభవంగా వివాహం జరిగింది. చాలా సంవత్సరాల పాటు జీవితాన్ని ఆనందంగా గడిపారు. ఉభయులు టిబెట్ ప్రజల సంక్షేమంకోసం తమ శక్తినంతా ధారబోసి పనిచేసారు. రాకుమారితోపాటు టిబెట్‌కువచ్చిన హాన్‌జాతి ప్రవీణులు టిబెట్ ప్రజలకు వైద్యం చేయడం, వ్యవసాయ పనిముట్లను చేసుకోవడం, బట్టలు నేయడం, భవనాలను నిర్మించడం, కాగితాన్ని తయారుచేయడం, లోహపు వస్తువులను తయారుచేయడం మొదలైన పనులను నేర్పారు.

జోఖన్ బౌద్ధ ఆరామము నిర్మింపబడుతున్న కాలంలో ఒకనాడు రాకుమారి వెన్ చెంగ్ అక్కడికి చూడడానికి వెళ్లిందట. పనిచేస్తున్న కార్మికులంతా ఆమె సౌందర్యాన్నిచూచి మంత్రముగ్ధులై పోయినట్లు అలానే ఉండిపోయారట. సింహద్వారంకోసం సింహాలను చెక్కుతున్న ప్రధాన శిల్పి మైమరచిపోవడం, పోవడంవల్ల చేయి పొరబడి సింహం ముక్కును విరగగొట్టేసాడట. అందువల్లనే ఇప్పుడు మనకు ఆ బౌద్ధ ఆరామంలోని సింహావిగ్రహాలకు ముక్కులు కనబడవు.

జోఖన్ బౌద్ధ ఆరామ నిర్మాణం పూర్తయిన తర్వాత రాకుమారి వెన్ చెంగ్ తనవెంట చైనా నుండి తీసుకొనివచ్చిన బుద్ధవిగ్రహాన్ని అందులో ప్రతిష్ఠింపజేసి, పూజించడం ప్రారంభించింది. తరుచు రాకుమారి జోఖన్ ఆరామానికివచ్చి టిబెట్ ప్రజలకు తన మాతృభూమిని గురించీ, ఆ దేశ ప్రజల జీవితవిధానాలను గురించీ ఉపన్యసిస్తుండేదట. ఆమెకు బౌద్ధమతంలోగల గట్టి విశ్వాసం ఫలితంగా స్రోన్ట్సన్ గంపోకు కూడా ఆమతంపట్ల విశ్వాసం యేర్పడింది. దాని ఫలితంగా బౌద్ధమతం టిబెట్‌లో బాగా ప్రచారమయింది. ఈనాటికిగూడా టిబెట్‌లోని బౌద్ధమతస్థులు సంవత్సరానికొకసారి జోఖన్ బౌద్ధ ఆరామానికి యాత్రవెళుతుంటారు. రాకుమారి వెన్ చెంగ్ తాను స్వయంగా అక్కడ నాటిన విల్లో చెట్లను దర్శించుకొని వస్తుంటారు.

టిబెట్ ప్రజలకు ఒక అక్షరమాలను సృష్టించి, వ్రాతభాషను రూపొందింప జేయమనికూడా ఆమె స్రోన్ట్సన్ గంపోకు సలహానిచ్చింది, గంపో అలానే చేసాడు.

రాకుమారి వెన్ చెంగ్‌కూ, స్రోన్ట్సన్ గంపోకు జరిగిన వివాహంద్వారా హాన్‌జాతివారికీ టిబెట్ ప్రజలకూ మధ్య స్నేహసంబంధాలు బలపడ్డాయి. తిరిగి క్రీ॥ శ॥ 710 లో రాకుమారి చిన్ చెంగ్‌కూ, త్రిదసో గ్ట్సన్‌కూ జరిగిన వివాహంద్వారా అవి మరింత బలపడ్డాయి. అది మొదలుకొని యీరక్త సంబంధాలు నానాటికీ బలపడుతూనే ఉన్నాయి.

# రాజకుమార్

ఫ్రెంచి మూలం:
అంటోని డెసయంట్-ఎక్స్‌వ్రూపేరీ

ఆంధ్రానుసరణ:
డాక్టర్ వి. ఎస్. శర్మ



[మన కథలోని ముఖ్య పాత్ర రాజకుమార్. రాజకుమార్ పుట్టిపెరిగింది మరో గ్రహమండలంలో. తన చుట్టుప్రక్కలనున్న గ్రహమండలాలని ఒకసారి చూసిరావాలని వుబలాట పడుతూ ప్రయాణానికి నడుము కట్టాడు. తన గ్రహమండలాలకన్నా అన్నివిధాల కొత్తగా, వింతగా నున్న ఆరులోకాలని ఇంతవరకు చూశాడు. అక్కడవున్నవాళ్ళని — అక్కడి వాళ్లంతా తమాషా మనుషులే! — పలకరిస్తూ ఆలోకాలని గురించి ఇంతో అంతో తెలుసుకున్నాడు. ఇప్పుడు రాజకుమార్ అడుగెడుతున్నది ఏడో గ్రహమండలం. భూలోకం. ఇకచదవండి]

## I

ఇప్పుడు రాజకుమార్ చూడటానికి వచ్చిన గ్రహమండలాలలో భూమండలం ఏడో గ్రహమండలం. నిజం బట్టిచూస్తే భూమండలాన్ని గ్రహమండలాల జాబితాలో చేర్చటం పొరబాటుఅనే అనవచ్చు. ఇతర గ్రహమండలాల పరిస్థితులు ఒక ఎత్తు, భూమండలం ఒక ఎత్తు. ఈ భూమండలాన్ని తలుస్తూవుంటే మనకి చప్పున జ్ఞాపకం వచ్చేది రాజులు రాజాధి రాజుల సంగతి. వాళ్లు ఒకళ్లా ఇద్దరా? నీగ్రో రాజులకి కూడా మనం ప్రాముఖ్యత ఇయ్యటానికి పూనుకుంటే ఆ రాజుల సంఖ్య నూర్లకి మించేవుంటుంది. వాళ్లకి సమానమైన వృజ్జీలు శాస్త్రజ్ఞులు; ముఖ్యంగా భూగోళశాస్త్రాన్ని క్షుణ్ణంగా అవగాహనం చేసుకున్న వాళ్లమని అనుకుంటూవున్న జాగ్రఫీ మనుషులు. వాళ్ళ సంఖ్య ఏడువేలకి మించేవుంటుంది. వాళ్ల కన్నా రెండుఆకులు ఎక్కువ చదివినవాళ్లు వర్తక వ్యాపారాలని చూసుకుంటూ వుండేవాళ్లు. వాళ్ళ జనాభా తొమ్మిది లక్షలపైగానే! వ్యాపారస్థులకి మించిపోయిన వాళ్లు త్రాగుబోతులు. వాళ్ల సంఖ్య 75 లక్షలకి మించేవుంటుంది. ఈ త్రాగుబోతులకి తలదాటినవాళ్లు డాబూ దర్పంతో కాలచక్రాన్ని గిరగిర త్రిప్పాలని వుబలాట పడుతూవుంటే దంభాచార్యులు వాళ్ల సంఖ్య కోట్లకి మించేవుంటుంది. వాళ్ళందరి అదుపాజ్ఞల్లో వుంటూ వుంటే వాళ్ల సంఖ్యని ఈ మొత్తాలలోకి చేర్చుకుంటేనా ఈ లోకపు జనసంఖ్య పెద్దపెద్ద మొత్తాలతోనే నిండిపోతుందని చెప్పవచ్చు..........

ఇప్పటి రోజులలో మన అవసరాలకి తప్పనిసరిగా వుండి పోయిన విద్యుచ్ఛక్తి మూలాన మన ఇండ్లని వెలిగించుకుంటూ వున్నాము. మన బజారులలో దేదీప్యమానంగా వెలుతురు వుండటానికి విద్యుచ్ఛక్తిని యథేచ్ఛగా వుపయోగించుకుంటు వున్నాము. ఈ శక్తిసంగతి ఏమాత్రము మనకు తెలియక వుండిన రోజులలో ప్రతి వూళ్లోలాంతర్లని ముట్టించే మనుషులని

ఈ పనినంతా చూసుకోటానికి నిర్ణయించు కోటం మనకి మామూలయిపోయింది. ఆరు ఖండాలలో ఈ పనినంతా చూసుకునే వాళ్ల సంఖ్యచూస్తే అది లక్షలకి మించే వుంటుందిగా! ఈ మనుషులకి ఇయ్యబడుతూవుంటే శిక్షణ సైనికులకి ఇచ్చే శిక్షణతో అన్నివిధాలా సరిపోల్చవచ్చు. వీళ్లంతా చేస్తూవుంటే పని పాటలని భూమండలానికి కొంచెం దూరంలో నుండే గ్రహమండలంలోనుంచి తాపీగా చూస్తూవుంటే నాటకరంగంలోకి మొదటి నుంచి తుదివరకు వాళ్ల వాళ్ల పాత్రలని యథోక్తంగా నిర్వహించు కోటానికి చక్కగా ముస్తాబుచేసుకుని వచ్చే నటీనట కులకిమల్లె వుంటుంది. వాళ్ళ నడక, వాళ్లు చేసేపనులు అన్ని విషయాలలో నాట్య కళతో పోల్చటంతో తప్పేమీ వుండదు. ప్రప్రథమంలో ఈ నాట్యాన్ని ప్రారంభించే వాళ్లు న్యూజిలాండు ఆస్ట్రేలియా పరిసరాలలో వుండే లాంతరు మనుషులు వాళ్లువాళ్లలాంతర్లని ముట్టించి నిద్ర పోవటానికి వాళ్ల ఇండ్లకి చేరుకునేటప్పటికి చీనా, సైబీరియా దేశాలలోనున్నలాంతరు పనివాళ్లు రంగంలోకి ప్రవేశిస్తారు. వాళ్ళు తెరచాటుకి పోవటంతోనే రష్యా,హిందూ దేశాలలోని వాళ్లు చరచర తెరచాటు నుంచి రంగస్థలంలోకి ప్రత్యక్షమవుతారు. వాళ్లు వెళ్లటమే తరువాయి - ఆఫ్రికా, అయిరోపాలలోని లాంతరు మనుషులు వాళ్లు తరవాత దక్షిణ అమెరికావాళ్లు ఆటుతరువాత ఉత్తర అమెరికావాళ్ళూ వాళ్ల వాళ్ల విధ్యుక్త ధర్మాలని చూసు కోటానికి రంగస్థలాన్ని ఆక్రమించుకోటం పరిపాటి. వాళ్ళుపుట్టి పెరిగింది ఈ వాతావరణంలోనే. ఇదంతా వాళ్లకి ఒక కళ. దానిని చూపెట్టటంలోకూడా ఎలాటి పొరబాటూ చేయరు. దీనికోసం వాళ్లు అస్తమానమూ చేసే సాధన చూస్తుంటే మనం ఆశ్చర్యపడిపోతాం ... ... ...

వీళ్లంతా ఇలా సంవత్సర పర్యంతం పని పాటల్ని చాకచక్యంతో చూసుకుంటూ వుంటూంటే ఇద్దరు లాంతర్ల మనుషులకి మాత్రం సంవత్సరంలో రెండురోజులు మాత్రమే పని. తక్కిన కాలమంతా ఎలాటి చీకుచింతా లేకుండా సోమరిపోతులకి మల్లె కాలక్షేపం చేయవచ్చు. ఆ ఇద్దరిలో ఒకాయన ఉత్తర ధృవంలోను, రెండో ఆయన దక్షిణ ధృవంలోను పని చేస్తూ వుంటాడు. ... ...

II

ఇలా భూమండలపు సంగతి చెప్తుంటే కొంతమందికి ఇదేమాత్రం నచ్చదన్న రహస్యం నాకు బాగా తెలుసు. ఈ ప్రపంచానికి సంబంధించిన మనిషిని కానని నన్ను అనటానికి వాళ్లు తటాపటాయించరు కూడా! అయినా వున్నది వున్నట్లు చెప్పటంలో తప్పేం వుంటుంది? ... ...

ఈ భూమండలంల్లో కోట్లకొలది జన సంఖ్య వున్నదని ఇంతకుముందే చెప్పాను కదూ! ఆ జనమంతా అదురూ బెదురూ లేకుండా భూమండలాన్నంతా ఆక్రమించుకుని వున్నారు. నిజం పట్టిచూస్తే వాళ్లకి అవసరంలేని భూభాగన్నంతా స్వంతంగా చేసుకున్నారనే అనవచ్చు. పెద్దపెద్ద సభల కోసం ఏర్పాటు చేయబడ్డ స్థలంలో వేల కొలది జనం సమావేశమవుతున్నట్లు, ఈ

లోకంలో నున్న వాళ్లనందరిని ఒకచోటికి తీసుకుని రావటానికి ప్రయత్నం చేశామా, వాళ్లంతా హాయిగా కూచోటానికి ఇరవై మైళ్ల పొడవు, ఇరవై మైళ్ల వెడల్పు గల ప్రదేశం చక్కగా సరిపోతుంది. ఇంకా దగ్గర దగ్గరగా కూచోబెట్టాలని నిశ్చయించుకుంటే పసిఫిక్ మహాసముద్రంలో నున్న లంకలలో ఒక చిన్నలంక ఈ ప్రజా సమావేశానికి అన్నివిధాలా సరిపోతుంది కూడా!

పెద్దవాళ్లు మనుకునే వాళ్లకి ఇదంతా మాయంగా కనపడవచ్చు. వాళ్ల వూహ అంతా వాళ్లు వుండటానికి బోలెడు స్థలం తప్పని సరిగా అవసరమని, వాళ్ల కోరికలు కూడా గొంతెమ్మ కోరికలు. వాటిని తూ. చా. తప్పకుండా కొనసాగించుకోటానికి వాళ్లకి ఎలాటిసాహసకార్యం చేయటానికి అదురూ బెదురూ వుండదు అంచేత అలాటి వాళ్లతో ఇలాటి సంగతుల్లో తర్జనభర్జన చేయటం వ్యర్థం. ..

III

మన రాజకుమార్ భూమండలంలో అడుగు బెట్టటంతోనే ఎవళ్లయినా తనకి కనబడుతారనే వుబలాటంతో నలు ప్రక్కలా కలయచూశాడు. ఎక్కడా నరపురుగు కనబడిన పాపానబోలేగా! పొరబాటున మరోగ్రహమండలంలోకివచ్చానా మరి అని కంగారుపడుతూ కొంతదూరం నడిచాడు. ఇసకలో త్రాడుకిమల్లె ఏదో వస్తువు కనబడ్డది. అది ఇసకలో ఇటూ అటూ కదులుతూ వుందికూడా! దానికేసి గబగబ నడుస్తూ "నమస్కారం! నమస్కారం" అని తన సాంప్రదాయసిద్ధమైన మర్యాదని దానికి చూపెడుతూ అన్నాడు.

"నమస్కారము! నమస్కారము" అని పాము తన పద్ధతిలో జవాబిచ్చింది.

"నేనిప్పుడు చేరుకున్న గ్రహమండల మేమిటి?" అని రాజకుమార్ ఆతృతతో అడిగాడు.

"నువ్వు వచ్చింది భూమండలంలోకి, నువ్వు ఇప్పుడు వున్నది ఆఫ్రికా" అని పాము జవాబిచ్చింది.

"ఆ! ... అయితే నరపురుగు ఇక్కడ కనబడటం లేదే?"

"ఇదంతా ఎడారి. ఎడారిలో ఎవళ్లూ వుండరు. .. భూమి ఎంతో పెద్దది" అని అన్నది పాము.

ప్రక్కనే రాతి బండ కనబడ్డది. అబ్బాయి దానిమీద కూచుని పైకి తదేక దృష్టితో కొంతసేపు చూస్తూ "పైనవున్న నక్షత్ర మండలాలు ఎలా తళుక్కు తళుక్కుమని మెరుస్తూ వున్నాయో చూడు. .... అదిగో అక్కడ కనబడుతూ వున్నదే నేను వచ్చిన గ్రహమండలం. ... ... అది ఇక్కడికి ఎంతదూరంలో వున్నదో కొంచెం తాపీగా చూడు?" అని వుత్సాహంతో అన్నాడు అబ్బాయి.

"చూడటానికి బాగానే వుంది ... కాని అంతదూరంనుంచి ఎందుకిలా వచ్చావు?" అని అబ్బాయికేసి ఆశ్చర్యంతో చూస్తూ పాము ప్రశ్నించింది.

"నా పువ్వు ఎంతో తొందర పెడుతున్నది." అని బిక్కమొహం వేసుకుని అడిగినదానికి సూటిగా జవాబు చెప్పకుండా రాజకుమార్ దానితో అన్నాడు.

"అలాగా!" అని జవాబిచ్చింది పాము.

కొంతసేపు ఎవళ్లూ మాట్లాడలేదు.

అబ్బాయే మాటా న్నివదిలేస్తూ "ఇంతకూ మనుషులు ఎక్కడ వున్నారన్న మాట? ఈ ఎడారిలో ఎవళ్లని చూడకుండా వుంటే ఒంటరిగా వుండిపోవాలసి వస్తుందే......" అని ఆదుర్దాతో అన్నాడు.

"మనిషి అనుకున్న వాడు మనుషుల్లోనే ఒంటరిగాడై పోవాలసి వస్తున్నదిలే" అని అనుకుంటూ అన్నది.

అబ్బాయి పాముకేసి ఆశ్చర్యంతో చూస్తూ "తమాషా జంతువుగా వున్నావే నువ్వు. నీ ఒళ్లంతా వ్రేలికిమల్లె సున్నితంగా వుంది..." అని ఏమో అనబోతున్నాడు.

పాము చప్పున అడ్డువస్తూ "అయితేనేం, నాకున్న బలం రాజులు అనుకునే వాళ్ల వ్రేలికికూడా లేదు" అని గర్వంతో అన్నది.

అబ్బాయి పాము మాటకి పకపక నవ్వుతూ "నీకు ఏమాత్రమూ బలంలేదు .. ఇంతకూ కాళ్లు లేవే. అలాటప్పుడు మనుషులకి మల్లె ఎలా నడవగలుగుతావు?" అని ప్రశ్నించాడు.

"అదంత బ్రహ్మావిద్య కానేకాదు. ఎక్కడికి తీసుకుని వెళ్లమంటే అక్కడికి నిన్నే తీసుకుని వెళ్లగలను కూడా" అని అంటూ అబ్బాయి దేహము మీదికి మెల్లగా ప్రాకింది. "మనిషిమీద నాకు కోపం వచ్చిందా, వాడు ఎక్కడినుంచి పుట్టుకుని వచ్చాడో అక్కడికి తిన్నగా పంపివేయగల శక్తిసామర్థ్యాలు నాదగ్గర వున్నాయి. నువ్వు మంచి కుర్రవాడివిగా కనబడుతున్నావు. నువ్వు వచ్చిందికూడా మరోలోకం నుంచి......" అని వానిని ఆప్యాయంగా నిమురుతూ అన్నది.

అబ్బాయి దానికి ఏం జవాబియ్యాక పరిసరాలని తదేకంగా చూస్తూ విస్తుపోతున్నాడు.

"బలహీనులు చేసేపని రాళ్లని రప్పల్ని నామీద విసిరేస్తు నన్ను వుక్కిరిబిక్కిరి చేయటం. నువ్వు అమాయకుడవని తెలుసుకున్నాగా, వాళ్లు నిన్ను వూరక వుండనిస్తారనుకున్నావా? నీ లోకానికి వెళ్లాలని ఎప్పుడైనా ఆతృత పడ్డావా అక్కడికి చేర్చే భారం నాది. స్వయంగా దాన్ని చేస్తాను......" అని అన్నది పాము.

"ఎందుకలా నా విషయం కంగారుపడటం? ఇలాటి చిక్కు సమస్యలంటే నీకు ఎంతో ఇష్టంగా వున్నట్లు కనబడున్నదే!" అని విస్తుపోతూ ప్రశ్నించాడు.

"ఈ జన్మంతా ఇలాటి వాటిని ఎదుర్కోటమేగా! వాటిని సునాయాసంగా తేల్చటమే నాపని!" అని చిరునవ్వు నవ్వుతూ అన్నది.

IV

రాజకుమార్ ఎడారిలోని వింతలను చూడటానికి బయలుదేరాడు. కొంతదూరం నడిచాక ఒకపువ్వు కనబడ్డది. దానికున్నవి మూడు ఆకులే. అవీ ఎంతో వాడి వున్నాయి. .....

"నమస్కారము, నమస్కారం" అని పువ్వుతో అన్నాడు అబ్బాయి.

అదీ 'నమస్కారమని, వాడితో అన్నది.

"ఇటు మనుషులు తారట్లాడుతూ వుండటం చూశావా?" అని దాని దగ్గర నుంచి మనుషుల సంగతి తెలుసుకోవాలనే ఆదుర్దాతో ప్రశ్నించాడు.

కొంత కాలం క్రిందట అటుకేసి కొంత మంది బాటసారులు పడవటం ఆ వువ్వుకి జ్ఞాపకం వుంది.

"మనుషుల సంగతా నువ్వు తెలుసుకోవాలని అలా వుబలాట పడడం? అయిదుగురు వున్నారు. వాళ్లని కొన్ని సంవత్సరాల క్రిందట ఇక్కడ కళ్లార చూశాను. కాని వాళ్లు ఇప్పుడు ఎక్కడ వుంటారో తెలుసుకోటం కష్టం." అని విచారంతో అన్నది.

"అలాగయితే ముందుకు నడుస్తాను" అని అంటూ అబ్బాయి దాని దగ్గర సెలవు పుచ్చుకొని అక్కడినుంచి బయలుదేరాడు.

# భక్తియోగనిరూపణం

శ్రీ వేదం వేంకట కృష్ణశర్మ

(గతసంచిక తరువాయి)

## భక్తియోగులకు శాస్త్రప్రయోజనము :-

1. ఈయోగంలో సిద్ధి పొందినతర్వాతకూడా, వేదసూత్రాలను, శాస్త్రాలను అనుసరించడం ముఖ్యమే. లేనిపక్షంలో భక్తిలో ప్రౌఢుడయినా, అధోగతి తప్పదు.

2. భౌతికశరీరం వున్నంతకాలం శాస్త్రోక్తమై పరంపరగా వచ్చే లోకాచారం వుల్లంఘించి చరించలేదు. దానివల్ల సంఘవిప్లవం, స్వవినాశం— ఎంతటి భక్తుడికైనా తటస్థించడం సహజం. దేహాన్ని పోషించడానికి ఆహారపానీయాలు ఏవిధంగా అవసరమో ఆవిధంగానే విధ్యుక్తకర్మలుగూడా అవసరం.

3. అతీతం అయిన భక్తే భగవత్పూజల్లో అనురక్తిని కలిగిస్తుంది. ఆమోస్తరు అనురక్తి భగవత్కైంకర్యాల్లో చూపటమే భక్తి. అటువంటి భక్తే ప్రేమస్వరూపం. అదేభక్తి— అని వేదవ్యాసులు.

4. పుణ్యకథాశ్రవణాదుల్లో అత్యంతాసక్తి చూపడం భక్తికి చిహ్నము— అని గరుడు.

5. 'ఆత్మానందానుభవానికి, ఆటంకం కానంత వరకూ, భగవద్విషయాల్లో ప్రేమచూపడమే భక్తి'— అని శాండిల్యుడు.

6. "భక్తి"— అంటే నిర్మలత్వంతో భగవంతునికి తన్ను తాను అర్పించుకోవడం అన్నమాట. అది మరచి మానవుడు విషయసుఖాలకు లోబడి, వాటిలో తలమునకలై, తన పూర్వస్థితిని జ్ఞప్తికి తెచ్చుకొని పశ్చాత్తాప పడతాడు.

## గోపికల భక్తి :-

నిజమయిన భక్తినిగూర్చి నిరూపించే కథలు మన పురాణాల్లో విశేషంగా వున్నాయి. అందులో ముఖ్యాలు— ప్రహ్లాద నారద పరాశర పుండరీక భీష్మ దాల్భ్యాదుల కథలు, ఇంకను అనేకులనుగూర్చి వేదవ్యాసులు, భాగవతంలో తెలిపినాడు. గోపికల భక్తి అత్యుత్తమమయిందిగా ఆయన చిత్రించినాడు. అంతమాత్రంతో తక్కినవాళ్ల భక్తి లోపభూయిష్ఠంగా శంకింపగాదు. అట్టివాళ్లభక్తి భగత్ప్రేమజన్యం. అది ప్రేమరూపం. అట్టిది ఆధ్యాత్మికంగా భగవత్తాదాత్మ్యాన్ని కలిగించి మోక్షానికి దారి చూపుతుంది. అది ఉత్కృష్టమయిన పరమపవిత్రభక్తి.— జారిణులప్రేమ. కళంకపంకిలము. ఆధిభౌతికం. అస్థిరం.

## ఉత్తమ భక్తి లక్షణము :-

1. పరతత్త్వవిజ్ఞానము భక్తికి ఆధారం కావడం చాలాముఖ్యమే అయినా, ఆతత్త్వజిజ్ఞాసతో దాన్ని ప్రేమించడమే ప్రధానం. ఆవిజ్ఞానాన్ని సాధనంగా అవలంబించి, భగవత్స్వరూపాన్ని అవగాహన చేసుకున్నాడు భక్తిసాధనం భగవత్సాక్షాత్కారానికి నడుపుతుంది. ఆయనమగూర్చిన జ్ఞాన మననాదులు ఏఆశ్రమస్థుడినైనా, ఉద్ధరించి, సారూప్యం సిద్ధింపజేస్తుంది.

2. ప్రేమ అత్యంతం. అతిశయించి భగవద్విషయంలో భక్తిగా పరిణమించినప్పుడు అదే ఉపాసకుడికి తగినఫలం ఇచ్చి తీరుతుంది. దురభిమానులను భగవంతుడు ద్వేషించును; దీనులను ప్రేమించును— హిరణ్యకశిప్రహ్లాదుల ప్రవర్తనలు ఇచ్చట అనుసంధించుకోవలెను.

3. మనం చూచే వస్తువులనుగూర్చిన తెలివి వాటిని చూచినంతమాత్రాననే లభిస్తున్నది. కాని వాటివల్ల కాక వాటివలనిఫలితాన్ని బట్టే, వాటి మహిమలను అర్థంచేసుకొంటున్నాం. ఒక పెద్ద మేడను చూస్తామనుకోండి. అలా, చూచినంత మాత్రాన్నే అది రాచనగరనే తెలివి వెంటనే మనకు కలుగుతోంది. కాని రాజును సంతోషపెట్టడం ఆ నగరుయొక్క పరిజ్ఞానంతో కాదు. మనం ఒక విందుకు హాజరవుతామనుకోండి.— అట్టి విందు సంబరంలో మనం తుష్టిగ తినే భోజనంవల్ల ఆకలి యేలాగయితా తీరుతుంది. ముక్తివిషయంకూడా అంతే. శాస్త్రాలన్నీ

బాగా చదివి అర్థంచేసుకోవచ్చు.— ముక్తి విషయం గ్రంథాలు చదివి గ్రహించవచ్చును. కాని, వాటిని అనుభవంలో ఉంచుకోకపోతే మోక్షం గగన కుసుమం.

## భక్తిమార్గాలు :-

1. విషయసుఖానందాన్ని విడిచిపెట్టడం,— అంటే, సంగమును వర్జించడమే. రెండూ వేలువేలుగా కనబడినా, ఆచరణరూపంలో మాత్రం ఒక్కటే. కనుక వాటిని వదలిపెట్టడం ముఖ్యకార్యం.

2. ఎడతెగని భగవదర్చనా కైంకర్య చింతనములు.

3. భగవన్మహిమాభివర్ణనములు భక్తులు చేస్తూ వుండగా శ్రవణానందంగా ఆలకించి ఆయన్ను పొగడడం.

4. భగవత్తత్వము అనుభవపూర్వముగ ఆకళించి తానందు సిద్ధుడగుటకు ప్రయత్నాలు ఎడవిడక చేయడం.

4. భక్తిమార్గములనుగూర్చి ముముక్షువులయిన ఆస్తికులలో పలువిధాభిప్రాయాలు వున్నాయి. అందు ప్రహ్లాదుని మతాన్ని అనుసరించి తొమ్మిది :— చూడండి :—

"తను హృద్భావల సఖ్యముల్,
శ్రవణముల్
దాసత్వముల్ వందనా
ర్చనముల్, సేవయు, నాత్మలో నెఱుకయుఁ
సంకీర్తనల్, చింతనం
బను నీతొమ్మిది భక్తిమార్గముల స
ర్వాత్ముఁ హరినమ్మి స
జ్జనుఁడై యుండుట భద్రమంచుఁ దలంతుఁ
సత్యంబు దైత్యోత్తమా !"

## సత్సాంగత్య ప్రభావం :-

1. మహాత్ముల సాంగత్యంవల్లనే ఆత్మోద్ధరణానికి మార్గం ఏర్పడుతుంది; కాని అట్టివారి సాంగత్యం దుర్లభం. ఒక వేళ అది లభించినా అగమ్యం. అందుకే భగవత్కృపాలేశం సంపాదించుకోవడానికి అచంచలంగా కృషిచేయవలె. ఏలనంటే :— అలాంటి మహాత్ములకు భగవంతుడికి అవినాభావ సంబంధం ఒప్పారుతూ వుంటుంది.

2. కామక్రోధాద్రి క్రతి చెలరేపి, మానవుణ్ణి దుర్జనసాంగత్యం అధోగతికి తీసికొని పోగలదు. సర్వవిధాలా అట్టిసాంగత్యం వదలిపెట్టవలె.

3. భక్తియోగసిద్ధికి ప్రయత్నించే వ్యక్తి ప్రాపంచికవిషయబంధనాలకు లొంగిపోతుంది. అలా ఒకసారి లొంగిపోయినతర్వాత ఇక పయికి లేపడం కష్టసాధ్యం. అందువల్ల అట్టి కట్టుబాట్లను తెగత్రెంచుకొని, త్రిగుణాల ప్రాధ్యాన్ని నిర్మూలించి తనసర్వస్వంగత్యాగం చేయుడం మిక్కిలి ముఖ్యకార్యం.

4. ప్రప్రథమంలో ముముక్షువు అయినవాడు తన కర్మలకు ఫలితాలను ఎదురు చూడరాదు. దుష్కృతమైనా సుకృతమైనా. అటువంటిఫలాల పర్యవసానం గణించని ద్వంద్వాతీతుడు కావలె.

5. అహోస్తగు కర్మఫలాలకు స్వస్తిచెబుతూ తుదకు అకర్మలకే ఉద్యాస పలకవలె. నిష్కామ్యలకంగా ఆర్యోక్త వేదశాస్త్ర విహిత కృత్యాలనే భక్తియోగసిద్ధుడు అతిక్రమించే శక్తిని అలవర్చుకుంటాడు అట్టి భక్తజనశ్రేష్ఠుడు తాను తరిస్తూ యితరులను కూడా తరింపజేస్తాడు.

## ప్రేమానుభూతి

1. మృదుమధురాహారం తిన్న మూగవానిని "నీవు భుజించిన వంటకం ఏలాగుంది ?"— అని అడిగితే-చెప్పలేడుగదా! ప్రేమానుభూతికూడా అలాటిదే. ఆప్రేమస్వరూపం అనుభవించేవ్యక్తికే బ్రహ్మానందం ఒనగూర్చేవిషయం. కాని అది అతడికి వాగ్గోచరం.— విశేషమేమంటే.— అది గుణరహితం; కామరహితం; నిత్యవర్ధమానం; అవిచ్ఛిన్నం; సూక్ష్మతరం; అనుభవగోచరం.

2. ఒకసారిగా దాన్ని ఆస్వాదించి అనుభవించినవాడు- మరల మరల దాన్నే కనగోరును; వినగోరును; స్మరింపగోరును.

3. అది త్రిగుణాశ్రయమయినప్పుడు, ఆ యా గుణసంపన్నులై, ఆర్తులు, జిజ్ఞాసువులు, ఉద్దిష్టార్థులు మాత్రమే ఆప్రేమతత్వమును అవగానము చేసికోగలరు. ఈత్రిగుణాలలోనూ- రెండోది అగు రజోగుణఫలితముకంటె, మొదటిదగు సత్వగుణఫలితమే మిన్న. మూడోది అయిన తమోగుణఫలితముకంటె రెండవదాని రజస్సుయొక్క ఫలితము ఉత్తమము.

4. ప్రేమస్వరూపము! భక్తియే— భగవత్తత్వ మెఱుంగుటకు అనుకూలించు సులభోపాయము. తక్కిన ఉపాయాలకంటె అది ప్రమాణీకరించదగినది. శాంతి సాధనముయినది. పరమానందదాయకమయినది. మోక్ష మార్గమునకు ప్రథమసోపానముగ ఆర్యులు నిర్ణయించినది.

5. భక్తులగువారు భగవంతునకే తమసర్వస్వము నర్పించినవారు అగుటచే— ప్రళయమే సంభవించినా లోకమే నిర్మూలమయినా వారిమనస్సునకు రవంత కూడా వ్యాకులమనేది వుండదు. యోగసిద్ధులయిన భక్తులు— అందరిమోస్తరుగానే, తమ అనుదిన వ్యాపారాలనుంచి యెట్లునూ తొలగిపోలేరు. కాని, వాళ్ల వ్యాపారాలన్నీ భగవదర్పితాలు కావడంవల్ల, దాని ఫలితాలను కించిత్తైనా లెక్కపెట్టకుండా వుండడానికి వారలవాటుపడతారు.

6. నిజమయిన నిర్వికార భక్తులు— స్త్రీలవిషయాలను, ధనాదికసంపద్విషయాలను, నాస్తికవాద విషయాలను వినడానికి ఇష్టపడరు. వాళ్లకు అభిమానం, దంబం వుండవు.

### తేలిన సారాంశం

1. నిశ్చల భక్తుడికి దంభర, దురభిమానం ఏమాత్రం వుండదు.

2. భక్తుడికి సిద్ధిపొందేవరకుమాత్రమే గుర్వాశ్రయం అవసరం.

3. భక్తుడికి జ్ఞానికివలె వేదశాస్త్రఉపనిషత్తుల పరిజ్ఞానాన్ని స్వయంగా సంపాదించుకొనే పాండిత్యం అక్కరలేదు.

4. కర్మయోగి అయిన గృహస్థునిమోస్తరు వేద శాస్త్రోదిత కర్మాదులు పాటింపవలసినపని లేదు.

భక్తిప్రభావాన్ని గూర్చి ప్రహ్లాదుడు చెప్పిన ఈ క్రింది అంశాలు గమనింపదగ్గవి:—

'చిక్కడు వ్రతముల గ్రతువుల
'చిక్కడు దానముల శౌచశీల తపములఁ
చిక్కడు యుక్తిని, భక్తిని
జిక్కిన క్రియ నచ్యుతుండు చిక్కిన
భంగిఁ''

"చాలదభూదేవత్వము,
చాలదు దేవత్వ, మధికశాంతత్వంబుఁ
చాలదు హరిమెప్పింప, వి
శాలోద్యములార, భక్తి చాలినభంగిఁ''

"అహింసా సత్య శౌచ దయా స్తిక్యాది చారిత్రా పాలనీయాని"

(అహింస, సత్యము, శౌచము, దయ, ఆస్తిక్యము— వీని పాటింప (పాలింప) దగును." ప్రేమస్వరూపభక్తి పదునొకండు భేదములు గలది. అయినను క్రియలో అవన్నియు నొక్కటే అని పరిగణించబడుతుంది.

భగవన్మహిమనూ, అతడి సౌందర్యాన్ని ప్రేమించడం, ధ్యానించడం, సేవించడం, మిత్రుడివలె ప్రియము నిండారు మనస్సుతో చూడడం, బిడ్డవలె లాలించడం, భార్యవలె అనురాగం చూపడం, తన్ను పూర్తిగా అర్పించుకొనడం, ఆయన్ను నీవుగా, నిన్నే ఆయనగా ఎంచడం, ఆయన లేనప్పుడు నీవేలేవు అనే అనుభూతి కలిగివుండడం.

కుమారుడు, వ్యాసుడు, శుకుడు, శాండిల్యుడు, ఉద్ధవుడు, గర్గుడు, కౌండిన్యుడు, ఆరుణి, బలి, హనుమంతుడు, విభీషణుడు— మొదలయినవారు ఈలాటి భక్తులే.

1. "అద్వేష్టా సర్వభూతానాం మైత్రః
కరుణఏవచ
నిర్మమో నిరహంకారః సమదుఃఖ
సుఖః క్షమీ ॥
సంతుష్టః సతతం యోగీ । యతాత్మా
దృఢనిశ్చయః ॥
మయ్యర్పిత మనోబుద్ధిః మద్భక్తః స,
మే ప్రియః''

ఏప్రాణిని ద్వేషింపక, అన్నిటిని కరుణతోను, మిత్రభావముతోను, చూచునో, అహంకారమమకారము లేమాత్రము లేకుండునో, సుఖదుఃఖములందు సమత్వముతో మెలగునో, ఎవడు నిత్యసంతుష్టియై చరించునో, ధ్యాన మననాదులందు సుస్థిరుఁడై యుండునో, ఆత్మను తన అదుపులో ఉంచుకొను శక్తి గలిగియుండునో తన మనస్సును బుద్ధిని పూర్తిగ నాకర్పించునో అట్టివాడే నాయందత్యంతభక్తి గలవాడు.

2. యస్మాన్నోద్విజతే లోకః, లోకా
న్నోద్విజతే చయః ॥
హర్షామర్ష భయోద్వేగైః ముక్తోయః
సచమేప్రియః॥
అనపేక్షః శుచిర్దక్షః, ఉదాసీనో
గతవ్యథః
సర్వారంభ పరిత్యాగీ। యో మద్భక్తః
స మే ప్రియః ॥
యో నహృష్యతి, న ద్వేష్టి। నశోచతి।
నకాంక్షతి।
శుభాశుభ పరిత్యాగీ। భక్తిమాన్ యః
సః మే ప్రియః।
సమః శత్రౌచ మిత్రేచ। తథా
మానావమానయోః
శీతోష్ణః సుఖదుఃఖేషు। సమస్సంగ
వివర్జితః
తుల్య నిన్దా స్తుతిర్మౌనీ। సంతుష్టో యే
న కేనచిత్ ॥
అనికేతః స్థిరమతిః భక్తిమాన్మే
ప్రియో నరః ॥
యేతు ధర్మ్యామృతమిదం యథోక్తం
పర్యుపాసతే।
శ్రద్ధధానా మత్పరమా భక్తాః తేతీవ
మప్రియః ॥

ఎవడివల్ల అయితే లోకం అలజడి పడదో, లోకం వల్ల యెవడైతే వ్యాకులం పొందడో, సంతోషం, విరోధం, భయోద్వేగం మొదలయిన వాటివల్ల ఎవడైతే తప్పించుకొని తిరుగుతాడో, వాడే ముక్తుడు, భక్తుడు. ఏలాటి కోరికలులేని వాడు ఎవడో, శౌచగుణం, దక్షత, ఉదాసీన భావం, చింతా విసర్జనం, సకలోద్యమ విరమణం మొదలయినవి ఎవడికుంటాయో వాడే నాభక్తుడు, నా ప్రేమకు పాత్రుడు. ఎవడుహర్ష విరోధాలనేవి లేకుండా వుంటాడో, శోకం, విరోధం ఎవడు పరిత్యజించినవాడో, మేలుకీళ్ళను ఎవడు సమంగా చూస్తాడో, వాడే నా మనస్సును చూరగొన్న భక్తాగ్రేసరుడు. శత్రుమిత్రులను, మానావమానాలను, సుఖదుఃఖాలను బంధమోక్షాలను, నిందాస్తుతులను సరకుచేయకుండా ద్వంద్వాతీతుడుగ మెలగ గలడో వాడే నా అనుగ్రహాన్ని పొందగలుగుతాడు, నిత్యానందుడుగ, మానిశ్రేష్ఠుడుగ, స్థిరనివాసరహితుడుగ, నిశ్చలచిత్తుడుగ, భక్తి ప్రపూర్ణుడుగ చరిస్తాడో వాడే నాకెంతో ప్రియుడు.

వినశ్వరం కాని ధర్మాన్ని అవలంబించి, నన్ను పూర్తిగ విశ్వసిలచి, నేనే తనకు తప్పక, అత్యంతోత్తమ గమ్యవస్తువని భావించి కొలుస్తాడో, అట్టి పరమభక్తి సంపన్నుడే నాకు మిక్కిలి ప్రియతముడు

## ఆళ్వారులు; వారి భక్తి

The Alvar Saints Neither ordinary Sadhakas, nor were they anxious to come into lime - light of public fame as teachers. They were perfect Siddhas, more than emanations of devine. who lived, moved and had being in him alone

Suddhananda Sarasvathi

## పన్నిద్దరాళ్వారులు

పన్నిద్దరంటే :- పంన్రెండుగురని. విష్ణుభక్తులలో వీళ్లు భగవత్సాక్షాత్కారం పొందినందువల్ల అతి ముఖ్యులుగా పరిగణింపబడతారు. (ఈ విధంగానే పరమ మాహేశ్వరభక్తులు అరవ ముగ్గురు — అరవంలో వాళ్ళను అరువత్తిమూవరంటారు.)

ఆళ్వారులు పంన్రెండుగురు ఈ క్రింద సూచింపబడ్డవారు:-

1. కులశేఖరాళ్వారు (కేరళదేశపురాజు)
2. నమ్మాళ్వారు
3. భక్తసారాళ్వారు
4. మధురకవి
5. విష్ణుచిత్తుడు
6. విప్రనారాయణుడు
7. నీలనాళ్వారు
8. తిరుమంగై ఆళ్వారు
9. తిరుప్పాణాళ్వారు
10. పొయ్గై ఆళ్వారు
11. పెరియాళ్వారు
12. పేయాళ్వారు

వీరుగాక, వీరిభక్తులు పెక్కురు: వీరెల్ల భక్తి మతమునకు మూలస్తంభములు. విశిష్టాద్వైత మత

వ్యాప్తికి పునాదులు. వైష్ణవ సిద్ధాంత సౌధమునకు సోపానములు.

ఆళ్వారులను అనుసరించి వచ్చిన పరమభాగవతు లంతా, విశిష్టాద్వైత మహాప్రవక్త అయిన శ్రీరామానుజుల బోధలను వ్యాపింపజేయడానికి దీక్షవహించుటచేతనే, పొంగిపొర్లి వస్తూవుండిన మహమ్మదీయుల దండయాత్రులకు ఏమాత్రం చెక్కుచెదరకుండా, భక్తి మతం అయిన వైష్ణవం పుంజీభవించి, దేశంలో అన్నిదిక్కులా తలయెత్తుకొని నిలువగలిగింది. క్రింద చెప్పబడ్డవారు నానా ముఖాలుగా భక్తిని గూర్చి ప్రబోధం చేసిన మతకర్తలు.

1. శ్రీ శంకర భగవత్పాదులు
2. శ్రీ రామానుజాచార్యులు
3. శ్రీ మధ్వాచార్యులు
4. శ్రీ నింబార్కాచార్యులు
5. శ్రీ వల్లభాచార్యులు
6. శ్రీ కృష్ణ చైతన్య మహాప్రభువు
7. శ్రీ సూరదాసు
8. శ్రీ గోస్వామి తులసీదాసు
9. శ్రీ జ్ఞానేశ్వరులు
10. శ్రీ నామదేవులు
11. శ్రీ ఏకనాథస్వాములు
12. శ్రీ తుకారామస్వాములు
13. శ్రీ రామదాసస్వాములు
14. శ్రీ రామకృష్ణ పరమహంస
15. శ్రీ వివేకానందస్వాములు
16. శ్రీరామ తీర్థస్వాములు

భక్తివిషయంలో ఒక్కొక్కరు నిరూపించిన మార్గం ఒక్కొక్క విధంగా కనబడినా, గమ్యము మాత్రం ఒక్కటే అనడంలో కించిత్తయినా సందేహంలేదు.

—(o)—

# స్వభావం

"లతిక"

తనయనొకపని నియమించి తల్లిపంపె,
తల్లి పంపున పాపాయి తరలి యేగె,
వేగి, పంపిన పనిచేసి యింటివైపు
మరలి వచ్చుచునుండ నా మార్గమందు;

పాప వచ్చుచు నుత్సాహపడినదేమొ!
వడిగ తమయిల్లు చేరగ పరుగులెత్తె;
పరుగు లోపల పావడా పాదములకు
తగిలె; ఆ పాప దబ్బున ధరణి బడియె.

ధరణి పడిపోయి, పాపాయి తిరిగిలేచి,
చుట్టు పట్టుల పరికించి చూసి, వుబికి
వచ్చు దుఃఖము నతి బలవంతముపయి
నాపుకొని, మందగతి తోడ నడువసాగె.

చిన్ని నడకలతో యిల్లు చేరె పాప!
చేరి, తల్లిని ద్వారము చెంత జూచె!
చూచినంతట యేడవ జొచ్చె పాప!
ఏడ్పుతోడనె హ్వాగ్గర గించు నటుల!

పడుట తోడనె యేడ్చుట పాప మాని
తల్లి జూచినయంతనె తాను యేడ్చె!
చిన్న పాపల కదువింత చేష్ట లివియె!
బాలలందరికున్న 'స్వభావ' మిదియె!

—o—

# సూర్యరశ్మితో గ్రామాలలో విద్యుచ్ఛక్తి ఉత్పత్తి

చౌకగా సులభ సూత్రంగా సాధ్యమని అమెరికన్ నిపుణుని సూచన

భారతదేశంలో సూర్యరశ్మి గొప్ప ప్రయోజనాలు సాధించే అవకాశం కలదని తాను భావిస్తున్నట్లు అమెరికన్ లఘుపరిశ్రమల ప్రదర్శన తాలూకు సాంకేతికాధికార వర్గనాయకుడు డాక్టర్ జాన్ ఐ. యెలట్ అన్నారు. ఈయన సౌరశక్తి వినియోగ విద్యలో నిపుణుడు. భారత దేశంలో ఇంధనంగానూ, విద్యుచ్ఛక్తి ఉత్పత్తికీ సౌర కిరణాలను వినియోగించవచ్చునన్నారు.

శ్రీ యెలట్, భారత గ్రామాలలో వంట చెరుకుకు బదులు సౌర కిరణాలు వినియోగించుకొని పయిపనులు చేసుకోవచ్చునన్నాడు. సౌర కిరణాల (సూర్యరశ్మి) నుంచి సరాసరి విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయవచ్చునన్నారు. ఇది చాల సులువూ, ఖర్చు తక్కువలో చేయవచ్చును అన్నారు.

అనువర్త సూర్యరశ్మి సంఘం (అప్లయిడ్ సోలార్ ఎనర్జి అసోసియేషన్) ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ అరిజోనా రాష్ట్రంలో ఫోనిక్స్ నగరంలో గల జాన్ యెలట్ ఇంజనీరింగ్ అసోసియేట్స్ సంస్థ అధ్యక్షుడుగా ఉన్న డాక్టర్ యెలట్, మద్రాసు ఐలండ్ మైదానంలో సెప్టెంబరు ఒకటో తేదీనుంచి ఏర్పాటు చేస్తున్న అమెరికన్ లఘు పరిశ్రమల ప్రదర్శనంలో సూర్యరశ్మి దైనందిన ఉపయోగాలు చూపే ఏర్పాటు చేస్తారు.

ప్రస్తుతం సూర్యరశ్మి వంట చేయటం, నీళ్లు కాచుకోవటం, సముద్ర జలాలను, లేక మురికి జలాన్ని పరిశుభ్రమైన జలంగా మార్పు చేయటం విద్యుచ్ఛక్తి ఉత్పత్తి వంటి పనులకు ఉపయోగించబడుతున్నదన్నారాయన.

సూర్య రశ్మితో చాల హెచ్చు ఉష్ణోగ్రత సాధించవచ్చును. అమెరికాలో ఈ పద్ధతులు పారిశ్రామిక పరిశోధనలలో ఎక్కువగా ఉపయోగిస్తున్నాము. అని డాక్టర్ యెలట్ చెప్పారు.

మద్రాసు లఘు పరిశ్రమల ప్రదర్శనంలో చూపించే వంటకు, నీళ్ల కావుకు పనికి వచ్చే సూర్య రశ్మి యంత్రాలు చాల చౌకలో తయారైనవి. చాల సులభమైనవి. అందువల్ల ఎవరైన వాటిని ఉపయోగించుకునే అవకాశం ఉన్నది అన్నారాయన.

ఈ ప్రదర్శనంలో చూపే సూర్య రశ్మి వినియోగ సాధనంలో బలమైన షార్ట్ వేవ్ రేడియో రిసీవర్ సెట్టు (రేడియో) కూడా ఉన్నది. ఇది ప్రపంచంలో ఏ స్టేషనునైనా వినిపించగలదని శ్రీ యెలట్ చెప్పారు.

విద్యుచ్ఛక్తి ఉత్పత్తి విషయంలో సూర్య రశ్మి భారత గ్రామాలలో ఎంతగానో ఉపయోగపడగలదు. ప్రతి గ్రామం సొంతంగా ఒక విద్యుచ్ఛక్తి ఉత్పాదక కేంద్రం ఏర్పాటు చేసుకోవచ్చును. ఇందువల్ల పెద్ద పెద్ద గ్రిడ్ల లింకులకు అయ్యే ఖర్చులు కలిసి వస్తవి. ఈ విషయంలో

పరమాణు శక్తికంటె కూడా సూర్యరశ్మి చాల ఉపయోగమైంది. పరమాణు విద్యుచ్ఛక్తికి ఉత్పత్తి చాల వ్యయంతో కూడిన యంత్రాలూ అవీ కావాలి. దీనికి కావలసిన యంత్రాలు చాల చౌకలో తయారయేవి.

ఉపగ్రహాలలో అమర్చిన ఇతర రకాల రేడియోలు పనిచేయటం ఆగిపోయినా సూర్యరశ్మి బ్యాటరీతో పనిచేసే రేడియో ట్రాన్స్మిటర్లు ఇప్పటికీ పనిచేస్తుండటాన్ని బట్టి సూర్య రశ్మిప్రయోజనం అర్థం చేసుకోవచ్చును అని డాక్టర్ మెలట్ పేర్కొన్నారు.

డాక్టర్ మెల్ట్ గత 8 సంవత్సరాలుగా ఫోనిక్సులో సూర్య రశ్మి ఉపయోగాలను గురించి, దానిని వినియోగించే పద్ధతులను గురించి పరిశోధన జరుపుతున్నారు. ఆయన ఇదివరకు న్యూజెర్సీలోని సీవెన్సు టెక్నికల్ ఇన్స్టిట్యూట్‌లో మెకానికల్ ఇంజనీరింగ్ శాఖాధిపతిగాను, ఆ తరువాత షికాగోలో ఇల్లినాయ్ విశ్వవిద్యాలయంలో పరమాణుశక్తి కార్యక్రమ సలహాదారుగాను పనిచేశారు.

మద్రాసులో అమెరికన్ లఘు పరిశ్రమల ప్రదర్శనం ఏర్పాటులో తోడ్పడటానికి అమెరికానుంచి ఈ వారం మరి నల్గురు ఇంజనీర్లు వస్తారు.

—o—

## అగ్గిపెట్టె అంత చిన్న కెమెరా

సోవియట్ దేశంలో, అగ్గిపెటె అంత చిన్నదీ, 150 గ్రాముల బరువుకలిగినదీ అయిన "కీవ్ - వేగా" అనే ఎమ్. ఎమ్. ఫిల్ము కెమెరా ఔత్సాహికుల ఉపయోగార్థం తయారుచేయబడింది. దీని లెన్సు తక్కువ ఫోకల్ లెంగ్తు కలిగివున్నది. రెండు మూడు మీటర్ల దూరంనుండి దీనినితో ఫోటో తీయవచ్చును. దీనితో 20 బొమ్మలు తీయవచ్చును. దీని షట్టర్ సెకండుకు 1/30, 1/60, 1/200ల వేగాన్ని కలిగివున్నది. దీనికి ఫ్లాష్‌లైటు అమర్చుకోవచ్చును.




# సాహసవీరులు

శ్రీ కానాధిభట్ల వెంకటసుబ్బారావు

(గతసంచిక తరువాయి)

పార్వతీ పరమేశ్వరులు ఒకరివైపొకరు చూసుకున్నారు.

"నిమిత్త మాత్రుడు దేవీ ఇతడిని నీవే క్షమించాలి" అన్నాడు.

పార్వతి చిరునవ్వుతో "వత్సా! లే!" అంది.

క్షేమేంద్రుడు చేతులు కట్టుకుని నించున్నాడు. "నిన్ను నీవు తెలుసుకోవటమే నీ అజ్ఞానాన్ని తరిమివేసింది. నీ పాపం పరిహారమైంది. ఏం కావాలో కోరుకో" అంది.

క్షేమేంద్రుడు ఆనందంతో "తల్లీ! నాకు పుత్రుడిని ప్రసాదించు!" అని అడిగాడు.

"అనుగ్రహిస్తున్నాను. పాతికేండ్లుపాటు జీవించి నీకు కీర్తిప్రతిష్టలనిచ్చే కుమారుడు కావాలా? కలకాలం బ్రతికి నీ వంశకీర్తిని నాశనంచేసే కూతురు కావాలా? కోరుకో" అంది.

"తల్లీ! కలకాలం బ్రతికి నా వంశకీర్తిని నాశనంచేసే కూతురెందుకమ్మా! నాకు పుత్రుడినే ప్రసాదించు!" అన్నాడు.

"సరే అనుగ్రహించాను!" అని ఒక దానిమ్మ పండును ప్రసాదించింది.

ఇంతలో వున్నట్టుండి క్షేమేంద్రుడు- "దెబ్బలు! దెబ్బలు! మంట! అబ్బ! బాధ!" అని అరవసాగాడు. పార్వతి ఆశ్చర్యపోయింది. "నీవా ప్రతిఫలం అనుభవించి తీరాల్సిందే! లేకపోతే అకారణంగా ఆ బ్రాహ్మణుని అవమానించి కొరడా దెబ్బలు ప్రసాదించుతావా! అతనికి తగిలే ప్రతి దెబ్బా నీకు తగులుతుంది. అనుభవించు." అన్నాడు శివుడు.

అలానే దెబ్బలను సహించాడు క్షేమేంద్రుడు. అటుపిమ్మట పార్వతీపరమేశ్వరుల వద్ద సెలవు పుచ్చుకొని రాజప్రసాదంచేరుకొని ఆ బ్రాహ్మణుని పిలిపించాడు. "మహాత్మా! మిమ్ముల నవమానించినందుకు నాకు ప్రతీకారం బాగానే జరిగింది. అయినా అందుకు నేను చింతించను. నా కోర్కె నెరవేరింది. మీకు వేయి జవారాలు బహూకరించటమే కాకుండా ఏబది ఎకరముల భూమిని కూడా అనుగ్రహిస్తున్నాను" అని చెప్పి వారిని ఆనందంగా సాగనంపాడు.

ఆరోజునుండే పూజలు పునస్కారాలూ యథాప్రకారం జరుగవచ్చునని శాశించాడు. మహారాణి జరిగిన విషయమంతా తెలుసుకొని పొంగిపోయింది. పార్వతీ పరమేశ్వరులను దలచుకొని దానిమ్మపండును భుజించింది. ఆ రాజప్రసాదంలో నీలి అని ఒక దాసీది వుంది. దానికి కూడా ఎంతో కాలంనుంచి సంతానం లేదు. పారవేయమని ఇచ్చిన పైతోలును భుజించింది. రాణీ, దాసీ ఇద్దరూ ఒకేసారి గర్భం ధరించారు. నవమాసముల అనంతరం రాణీ కుమారుని గన్నది. నీలి కూడా అదేక్షణంలో మగబిడ్డని కన్నది.

శివప్రసాదం వలన కలిగిన ఆ బాలునికి "హరకుమార్" అని నామకరణం చేసి అల్లారుముద్దుగా పెంచుతున్నారు. నీలి తన కొడుక్కు "శివబంటు" అని పేరుపెట్టుకుని అల్లారుముద్దుగా పెంచుతోంది.

యుక్తవయస్సు రాగానే రాజవిద్యాంసులను

రావించి హారకుమార్‌కు సకలవిద్యలూ నేర్పింపసాగాడు. శివబంటు కూడా హారకుమార్ ప్రక్కనే వుండి కొద్దిగా చదువు నేర్చుకున్నాడు. మహారాజకుమారుడైనా హారకుమార్ శివబంటును వదిలి వుండేవాడు కాదు. ఇద్దరూ ఒకేచోట ఆటపాట లాడుకునేవారు. ఎంతో గాఢమైన స్నేహంగా మారిపోయింది. శివబంటును విడిచి హారకుమార్ వుండలేడు; రాజపుత్రుని విడిచి శివబంటు వుండలేడు. కొలదికాలంలోనే వారు సకల శాస్త్రాల్లోనే కాక అస్త్రశస్త్ర విద్యల్లోకూడా ఆరితేరారు.

ఇలా వుంటుండంగా హారకుమార్ ఒకసారి తండ్రి దగ్గరకు వచ్చి "నాన్నా! నాకు దేశాటనం చేసి వింతవింత విషయాలను కండ్లారాచూసి రావాలనని అభిలాష కలిగింది. తమ ఆజ్ఞ అయితే వెళ్లివస్తాను" అన్నాడు.

మహారాజు ఒక్కసారి వులిక్కిపడ్డాడు. "పిచ్చి తండ్రీ! నిన్ను విడిచి ఒక్కక్షణం వుండగలనా! వింతలూ విశేషాలూ చూడటానికి దేశాటనం చెయ్యాలా! రేపీపాటికి మన రాజమహల్లో అనేక వింతవస్తువుల్ని తెప్పిస్తాను! నామాట విని నీవా ప్రయత్నం మానుకో!" అన్నాడు రాజు.

కాని హారకుమార్ మొండిపట్టు విడవలేదు. మహారాజు హృదయంలో ఒక విషయం గుర్తుకు వచ్చింది. పార్వతీదేవి తన కుమారుడికి పాతికేండ్ల వరకే ఆయుస్సు ప్రసాదించింది. ఆ విషయం తలుచుకున్నప్పుడల్లా రాజుగుండెలు దడదడలాడిపోయేవి. ఈ విషయం యింతవరకు ఎవ్వరికీ చెప్పలేదు. కుమారుడేమో మొండిపట్టు పడుతున్నాడు. ఎలా?

సుగుణ కూడా కుమారుడిని ప్రయాణం విరమించుకొమ్మని కోరింది. "నాయనా! లేకలేక కలిగావు. నిన్ను విడిచి వుండలేం. నామాట విని నీ ప్రయత్నం విరమించుకో" అంది.

కాని హారకుమార్ ససేమిరా వెళ్లితీరాల్సిందే అన్నాడు.

హారకుమార్ వినలేదు. విధిలేక నా దంపతులు సరే నన్నారు.

ఇంతలో శివబంటు పరుగెత్తుకుంటూ వచ్చి— "నేను కూడా మీ వెంటే. నన్నొదిలిపెట్టి వంటిగా వెళదామనుకుంటున్నారేమో కాని అదేమీ కుదరదు" అన్నాడు.

"నీ వక్కరలేదు" అన్నాడు హారకుమార్.

"అలా అంటే ఇక్కడే ప్రాణాలు తీసుకు చస్తాను యువరాజా! మిమ్మల్ని విడిచి నేనుండలేను" అన్నాడు కన్నీళ్లతో.

యువరాజు సరేనక తప్పలేదు.

నీలి తన కొడుకుని వద్దని బ్రతిమాలుకుంది. కాని వాడు వినలేదు. విధిలేక సరేనంది. వారుభయులు బయలుదేరబోతుండగా— "యువరాజా! నీ విహారం విజయవంతంగా ముగించుకొని త్వరలో విచ్చేయువలసిందిగా మా ఆకాంక్ష—" అన్నారు రాజదంపతులు ఏకకంఠంగా.

హారకుమార్, శివబంటూ తమతమ తల్లిదండ్రుల వద్ద సెలవుపొంది చెరియొక గుఱ్ఱమెక్కి చెలో! అన్నారు.

3

అలా వారిద్దరూ కొండలూ, అడవులూ దాటుకుంటూ చాలా దూరం వచ్చేశారు. చివరికి ఒక అరణ్యంలోకి వచ్చింతరువాత ఒక చెట్టునీడన ఇద్దరూ దిగారు. కాస్సేపు నీడన కూర్చున్నారు. ఇంతలో హారకుమార్- శివబంటూ నాకు భలే ఆకలవుతుందోయ్! అన్నాడు.

"ఫర్వాలేదులే యువరాజా! మా అమ్మ నా కోసమని రొట్టెలుచేసి యిచ్చింది. వీటిని పుచ్చుకోండి—" అన్నాడు.

"నీ కోసం మీ అమ్మ చేసిపెట్టిన రొట్టెలను నేను పుచ్చుకోవటమంత మర్యాదకరమైన విషయం కాదు. అలా వెళ్లి కాసిని మంచినీరు తెచ్చిపెట్టు. ఆకలి చల్లార్చుకుంటా" అన్నాడు. "భలే యువరాజువే! క్రిందటి మకాంలో మీ రొట్టెలు నేను తినలేదా? ఈ రొట్టెలు పుచ్చుకోవాల్సిందే-" అని సంచీ విప్పి రొట్టెలు ముందుంచాడు. విధిలేక హారకుమార్ వాటిని స్వీకరించాడు.

"మీరు వీటిని తింటూ వుండండి. కనుమూసి కనుతెరచినంతలో పరుగెత్తుకువెళ్లి మంచితీర్థం తీసుకొస్తా" నని తోలుసంచీ తీసుకుని పరుగెత్తాడు శివబంటు.

గంటయింది; రెండు గంటలయింది. ఎంగిలిచెయ్యి ఎండిపోయింది కాని శివబంటు జాడలేదు. యువరాజుకు ఆశ్చర్యమేసింది. యీ అమాయకుడిని ఏ రాక్షసి అయినా గుటుక్కుమనిపించలేదుకదా అనే అనుమానం బయలుదేరింది. ఇలా ఎప్పుడైతే శంక బయలుదేరిందో అప్పుడు వెంటనే శివబంటు వెళ్లిన దిక్కుగా బయలుదేరాడు. ఎంత దూరం వెళ్లినా వాడి జాడ కనుపించలేదు. వెళ్లి వెళ్లి చివరకు

ఒక కొలను ఒడ్డుకు చేరుకున్నాడు. హరకుమార్‌కు మంచినీటి విషయమే పోయింది. శివబంటు ఏమైపోయాడా అన్నదే ప్రశ్న. వెంటనే కొలని ఒడ్డుననున్న చెట్టునెక్కి నలువైపులా గాలించసాగాడు. కనుచూపు మేరలో శివబంటు జాడేలేదు. ఇంతలో వున్నట్లుండి చెట్టుకొమ్మ ఫెళఫెళమని విరిగింది. ఇంకేముంది? ఆ కొమ్మతోసహా హరకుమార్ నీటిలో పడిపోయాడు. హరకుమార్ నీటిలోపడిన తత్క్షణమందే ఒకచేప చక్కగా యీదుకుంటూ వచ్చి అతణ్ణి మ్రింగివేసింది.

(సశేషము)

# తృప్తి

శ్రీ బొడ్డుపల్లి కృష్ణావధాని

ఒక గ్రామములో రాగమ్మ అనే ముసలమ్మ ఒకామె గలదు. ఆమెకు ముగ్గురు కుమార్తెలు గలరు. పెద్ద కూతురు పేరు సుశీల, రెండవకూతురు పేరు శారద, మూడవ కూతురు పేరు మీనాక్షి. పుత్రులు లేరు. కూతుళ్ళు ముగ్గురు వారి వారి కాపరాలు చేసుకుంటూ సుఖజీవనం చేస్తున్నారు!

రాగమ్మకు వృద్ధాప్యము వచ్చింది. తన వంటిమీద నగలమ్మినడబ్బు, భర్త చనిపోతూ తనకు వదలిన ఆస్తికలిసి పది వేలు వున్నది. ఏ కూతురు సరిగాచూస్తే, ఆ కూతురుకే ఈ ఆస్తిఅంతా ఇచ్చి అక్కడే "కృష్ణా, రామా" అనుకుంటూ కాలక్షేపం చేదామనుకుంది రాగమ్మ, కాని ఎవరు బాగాచూస్తారో ఎలా తెలుసుకోవటం.

రాగమ్మ పెద్ద కూతురైన సుశీలదగ్గరకువెళ్ళి "అమ్మా! అమ్మా సుశీలా! పెద్దదానై పోతున్నాను. డబ్బునాదగ్గరుంటం మంచిదిగాదు. నీకు, నీ పిల్లలకు ఏమేమి కావాలో చెప్పుతల్లీ చేయిస్తాను" అన్నది.

అనటమే తడవుగా సుశీల ఎగిరిగంతేసి "అమ్మా! ఎన్నాళ్ళనుంచో అనుకుంటున్నాను – మెళ్లోకి నెక్లెసు, నడుంకి వడ్డాణం చేయించుకుందామని. అవి చేయించవే చాలు. పెద్దవాడు వుంగరమో అని ఏడుస్తున్నాడు. పిల్లకు మొలబిళ్ళ చేయించవే అమ్మా" అంటూ చెబుతూనే ఉన్నది. "అలాగేనే" అంటూ అక్కడ నాలుగు రోజులుండి తరువాత రెండో కూతురు శారద దగ్గరకు వెళ్ళింది రాగమ్మ.

శారదతోనూ రాగమ్మ పెద్దకూతురుకు చెప్పినట్లే చెప్పింది. అపుడు శారద "అమ్మా నాకొక నాలుపేటల చంద్రహారం చేయించవే. పిల్లలమాట తరువాత చూచుకోవచ్చును." అంది.

"సరేలేవే అమ్మా" అని అక్కడ నాలుగు రోజులుండి చిన్నకూతురు మీనాక్షిని చూట్టానికి వెళ్ళింది.

మీనాక్షి తల్లిని చూడటమే తడవుగా ఎగిరి గంతేసి "అమ్మా ఎన్నాళ్ళకువచ్చావే! ఒంట్లో కులాసాగవుంటున్నదా. ఎంత చిక్కిపోయావే. ఎంత సేపయిందో అన్నం తిని. వేడినీళ్లున్నాయి స్నానంచేయి భోం చేద్దాము" అంటూ తల్లిని పరామర్శించింది.

భోజనాలయాక రాగమ్మ మీనాక్షి తలనిమురుతూ "చిన్నమ్మాయీ! నాదగ్గర

డబ్బుఉండి పూరికే మూలగటమేగా! నీకే దయినా వస్తువులు చేయిద్దామను కున్నాను, ఏం చేయించుకుంటావో చెప్పు తల్లీ'' అన్నది.

ఆ మాటలకు మీనాక్షి ''అమ్మా నాకేం కొదువే అన్నీ వున్నాయి-అయినా తృప్తెక్కడికే! ఎక్కడి కక్కడికే సంతుష్టి చెందాలి. అయినా! అమ్మా నీవీ వృద్ధాప్యంలో అక్కడా, అక్కడా ఇబ్బంది పడక ఇక్కడ ఉండిపోవే అదే నాకుచాలు నాకిం కేమీవద్దు'' అని బ్రతిమలాడింది.

''నాకు తెలుసేతల్లీ నీ మనస్సు. ఉన్న దాంతోనే తృప్తిపడతావు.'' అంటూ రాగమ్మ కావలించుకుంది మీనాక్షిని. ఆనాటినుండీ రాగమ్మ తనకున్నది చిన్న కూతురికి వద్దన్నా ఇచ్చి అక్కడే సుఖంగా వుంటున్నది.

చూచారా బాలలూ! మానవునకు తృప్తి ఎంత అవసరమో!!

# విశ్వామిత్రుడు

## శ్రీ ఆకుండి వెంకటశాస్త్రి

శ్రీమద్రామాయణంలో బాలకాండలోని కథా భాగానికంతకీ విశ్వామిత్రుడు సూత్రధారుడుగా కన్పడుచున్నాడు. విశ్వామిత్రుడు రాకమునుపు బాలకాండలో జరిగిన గాథ స్వల్పము. దానిని రెండు ముక్కల్లో చెప్పొచ్చు.

అనగా అనగా కోసలదేశంలో అయోధ్య అనే రాజధాని ఉంది. దాన్ని సూర్యవంశపు రాజుల్లో దశరథుడనే రాజు పరిపాలిస్తూండేవాడు. ఆ రాజునకు ముగ్గురు భార్యలు. ఆ ముగ్గురు భార్యలకు నల్గురు కొడుకులు. అనేటప్పటికి కథతిష్టవేస్తుంది. కొత్తగా బండికికట్టన గుఱ్ఱంలాగ ముందుకుసాగదు. ఇలా ఆగిన కథను విశ్వామిత్ర ప్రవేశం, ముందుకు నడుపుతుంది.

అసలీ విశ్వామిత్రు డెవరు? ఈయన తండ్రి గాధి అనేరాజా. ఈ రాజవంశము సుప్రసిద్ధమైంది. విశ్వామిత్రుడు అనేక వేల సంవత్సరాలు పరిపాలించాడు.

ఒకప్పుడు వేటకు బయలుదేరి వసిష్ఠాశ్రమం చేరుకున్నాడు. అతడు చతురంగబలాలసైన్యంతో, రాజలాంఛనాలతో వసిష్ఠాశ్రమం దగ్గఱ మకాంచేశాడు. ఇక వసిష్ఠుడు, మునిసంఘాలతో, వేదఘోషలతో బ్రహ్మజ్ఞానము బ్రహ్మతేజస్సు వెలువరిస్తున్నాడు. పరస్పర కుశల ప్రశ్నములైన తరువాత విశ్వామిత్ర రాజునకు మహారాజభోగ్యమైన షడ్రసోపేతమైన విందు చేస్తాడు. ''నీవు సామాన్యమైన మహర్షివి. నీ వింతవైభవముగా విందు యెలా చేయగలిగావు?'' అని విశ్వామిత్రుడు ఆశ్చర్యపడ్డాడు. 'శబల' అనే కామధేనువు తనకు ఏవి కావలిస్తే అవి సంకల్ప మాత్రంచేత యిస్తుంది అని అన్నాడు.

అలైతే తన కాయావునిమ్మని విశ్వామిత్రుడు పట్టుపట్టినాడు. తనకా ఆవు చాల ప్రియమైనదని, హవ్యకవ్యాదులకు బలిదానాలకి అది తనకు అత్యవసరమని ఆవు నతనికివ్వ నిరాకరించినాడు. అసహాయుడైన వసిష్ఠునకు తోడునీడగానున్న ఆధేనువు విజృంభించి, విశ్వామిత్రుని, అతని సైన్యాల్ని పరాభూతం చేస్తుంది.

ఇంతకీ కారణమైంది, వసిష్ఠుని బ్రహ్మతేజము. ''క్షత్రియ బలం ఏంబలం? బలం అంటే బ్రహ్మతేజమే బలంకాని'' అని ఘోరమైన తపస్సుచేసి విశ్వామిత్రుడు బ్రహ్మీభవించినాడు.

ఇతని బ్రహ్మ బలాన్ని నమ్ముకొని, తనకు శరీర స్వర్గ మిప్పించవలసిందని త్రిశంకుడీయనను ఆశ్రయించినాడు. అదెంతపని! అలాగే వెళ్ళవచ్చునని ఈయన్ని ఇంద్రలోకానికి సశరీరంగా పంపించినాడు. భూలోకవాసుల కటువంటి అర్హతలేదని ఇంద్రాది దేవతలు త్రిశంకుని క్రిందికి నెట్టేశారు. విశ్వామిత్రుడతనిని పైకి పంపించినాడు. దేవతలతనిని

క్రిందికి త్రోసివేసినారు. చేయునదిలేక త్రిశంకుడు ఆక్రోశింపగా, అంతరాళమున నతనికి ప్రత్యేకస్వర్గము నిర్మించి "త్రిశంకు స్వర్గము"నకు మూలపురుషుడై నాడు.

సృష్టికి ప్రతి సృష్టిచేసిన సమర్థుడు. ఐతే హరిశ్చంద్ర కథాసందర్భములో యీతడు మిక్కిలి కోపిష్టిగా కనపడతాడు. అన్నిటికంటె యీయన మనస్సంతా వసిష్ఠునితో పోటీమీదే లక్ష్యమై ఉంటుంది. హరిశ్చంద్రునికి వన్నె తెచ్చిన సత్యవ్రత పరీక్ష వసిష్ఠునిమీద పగతీర్చుకొనడానికే గాని హరిశ్చంద్రుని మీద కోపముచేతగాదు.

ఐతే రామాయణంలో శ్రీరామ కథా సందర్భములో విశ్వామిత్రుడు అంత ఉద్ధతుడులాగ కనపడడు. లోకంలో తక్కిన అందరు ఋషులవలె తాను తపస్సుచేసుకొనేవాడు. తపశ్చర్యలో ఉన్న ఋషులందరికీ రాక్షసులు విఘాతము కల్పించటం పరిపాటి. తన ఆశ్రమానికి తాటకాపుత్రులైన సుబాహుడు, మారీచుడు అనేరాక్షసులు విఘాతము కల్పిస్తున్నారు. ఋషులు తలచుకొంటే వారి తపోబలం వల్ల రాక్షస నాశనంచేయ గలరు. కాని అతసాధనము మోక్షప్రాప్తికై వినియోగిస్తారు కాని రాక్షస వినాశనానికి వెచ్చించరు.

ఆయనకు దివ్యదృష్టివలన తెలుసును - దశరథ రాముడు రాక్షస సంహారానికి పుట్టినవాడని. రాముని తీసికొనివస్తే రాక్షస సంహారమూ ఔతుంది. భవిష్యద్రామాయణ కథకు అంగభూతమైన సీతాకల్యాణము అవుతుంది అని.

ఇందుకోసమే ఈయన అయోధ్యానగరం బయలుదేరి వెళ్ళి రాక్షస సంహారము కోసము శ్రీరాముని పంపించవలసిందని దశరథమహారాజును అడిగినాడు. దశరథుడు రాముని విశ్వామిత్రుని వెంట పంపుట కంగీకరింపలేదు. రాముడింకను చిన్నపిల్లవాడు. పదహారేండ్లైనను నిండలేదు. రాక్షసులతో యుద్ధము చేయుట యెట్లు సాధ్యమౌతుందని సందేహించినాడు. నాకు పెద్ద సైన్యమున్నది. నేనా సైన్యమును తీసికొని వచ్చి నా ప్రాణమున్నంతవరకు నేను రాక్షసులతో పోరాడుతాను. ఇంతలో నీ వ్రతము సమాప్తి ఔతుంది. అంటాడు. అంటే విశ్వామిత్రుడు అలా కాదు రాముడే యీ రాక్షసవధకు అర్హుడు. పౌలస్త్య బ్రహ్మవంశములో పుట్టిన రావణుడు బ్రహ్మ వరప్రసాదముచేత గర్వించి, మా యజ్ఞాలకు విఘ్నంచేస్తున్నాడు. — — ఆ రావణాసురుడు మారీచ, సుబాహులను యజ్ఞధ్వంసంకోసము నియోగించాడు. వారిని నిరోధించడానికి నావద్ద ప్రత్యేకమైన అస్త్రములున్నవి. వానిని శ్రీరామునికి ఉపదేశంచేస్తాను అంటాడు.

దశరథుని కింక తప్పినదికాదు. కులగురువైన వశిష్ఠుడు మంత్రులుకూడా రామలక్ష్మణులను విశ్వామిత్రుని వెంట పంపవలసినదని ప్రోత్సహించినారు.

విశ్వామిత్రుని వెంట రామలక్ష్మణులు బయలుదేరి వెళ్ళినారు. బల, అతిబల అనే రెండు విద్యలు విశ్వామిత్రునికి తెలియును. వాని ప్రభావమేమిటంటే, శత్రువులను జయించడానికి ఉపయోగిస్తాయి. ఎంతకాలమైనా ఆకలి, దప్పులులేకుండా నిలుపుతాయి.

విశ్వామిత్రుడు మంచిగురువు. రామలక్ష్మణులు ఉత్తములైన శిష్యులు. గురువంటే భయభక్తులతో ప్రవర్తించి శుశ్రూషచేశారు. రామలక్ష్మణులు ప్రతివిషయమూ తెలిసికోవాలని కుతూహలముండేది వారికి. విశ్వామిత్రుని ఆశ్రమానికి వెళ్ళేమార్గములో ఉన్న దేశాలు, దాని పుట్టుపూర్వోత్తరాలు, నదీనదాలు, అడవులు, కొండలు మొదలైనవి వివరంగా తెలిసికొన్నారు. కథలు చెబుతూ, లాలిస్తూ, బుజ్జగిస్తూ, రామలక్ష్మణులను ముందుకుతీసికొని వెడతాడు.

సరయూ నదీతీరములో ఒకరాత్రి విశ్రమించారు. చిన్న పిల్లలైన రామలక్ష్మణులకు తెల్లవారినప్పటికి మెలకువరాదు. తెల్లవారగనే విశ్వామిత్రుడు వారిని లేపుటకు,

"కౌసల్యాసుప్రజా రామ - పూర్వాసంధ్యా ప్రవర్తతే।
ఉత్తిష్ఠనరశార్దూల! కర్తవ్యం దైవ మాహ్నికమ్॥

అని మేలుకొలుపుపాడి లేపినాడు.

మళ్లీ ముందుకు వెళ్ళేటప్పుడు పథశ్రమం తెలియకుండా కథలు వారికి త్రోవపొడుగునా చెప్పినాడు.

త్రోవలో 'అంగరాజ్యం ప్రవేశించారు. ఇక్కడ మన్మథుడు శివతపోభంగము చేయడంవల్ల నిటలాక్షుని

నేత్రాగ్నికి ఆహుతియైనాడు. మన్మథుని అంగము అనగా (శరీరము) దహింపబడిన చోటు గనుక దీనికి అంగరాజ్యము' అనే పేరు వివరించి చెప్పినాడు. ఇట్లే, మల, కరూశ దేశముల పేర్లుకూడా యెలావచ్చినవో వివరించి చెప్పినాడు.

తరువాత తాటక కథ చెప్పి అతడు ఆమెను చంపడానికి ప్రోత్సాహము చేసినాడు. తాటక సుందుని భార్య. ఆమె కొడుకు మారీచుడు. భయంకరాకారుడు. ప్రజాపీడ చేస్తూంటాడు. సుబాహుమారీచులను చంపి యీ వనము నిష్కంటకము చేయమనికోరినాడు. ఐతే స్త్రీవధము చేయడం ఎలాగ అని రాముడు సందేహించగా నీకు తప్ప, ముల్లోకములలోని ఆమెను చంపుట కెవరికి శక్తి చాలదు. ఈ విధంగా ఆమెను చంపుట పాపముకాదు. అధర్మవర్తనులైనచో, గోబ్రాహ్మణ హితము కొరకు చంపవచ్చునని చెప్పి రాక్షస వధ చేయించినాడు. ఈ రాక్షస సంహారము సీతాకల్యాణమునకు నాంది. జనక మహారాజు ఉన్నాడు. ఆయన కుమార్తెను సీతను పెండ్లియాడుదువాయని రాముని ప్రశ్నింపక, జనకమహారాజు, యజ్ఞము చేస్తున్నాడు. అక్కడ ఒక చిత్రమైన ధనుస్సు ఉన్నది. అది పూర్వము పరమశివుడు త్రిపురాసుర సంహారము నిమిత్తము వాడిన దాని నొక యినుపపెట్టెలో పెట్టి యీ మిథిలానగరంలో దాచి ఉంచారు. చూతువుగాని రమ్మని తీసికొని వెళ్ళినాడు. కొత్తగా ధనుర్విద్యాభ్యాసము చేసిన శ్రీరామునికి ధనుర్దర్శన కుతూహలం ఉండడం సహజమేకద !

అలా మిథిలానగరం వెడుతూ, మహేశ్వరుని తపస్సు, గంగావతరణము, భగీరథుని ప్రయత్నము, మొదలైన కథలు, ఉపకథలు చెపుతూ మరిపించి నడిపించాడు.

త్రోవలోని నిర్జనమైన గౌతమాశ్రమం కనబడుతుంది. గౌతమ శాపమున ఱాయియై పడియున్న అహల్యకు శాపవిమోచనము జరుగుతుంది. శ్రీరాముని దర్శనమే అవధిగా ఆమె శాప విమోచనము చేయించినాడు.

అంతట మిథిలానగరం ప్రవేశించినారు. జనకుడు, ఆయన పురోహితుడు, విశ్వామిత్రుని, రామలక్ష్మణులను ఆహ్వానించారు. విశ్వామిత్రుడు శ్రీరామునికి శివధనుస్సు చూపింపుమని జనకునికి తెలియజెప్పను.

ఆ ధనుస్సు చాలా బరువైనది. ఎవ్వరూ దానిని కదపలేరు. ఎత్తలేరు. అటువంటి ధనుస్సును చేతబట్టి యెక్కుబెట్టబోగా, అది ఫెళ్ళున విరిగిపోయినది. జనకుని ప్రతిజ్ఞ ప్రకారము శ్రీరామునకు సీతనిచ్చి పెండ్లి గావించినారు.

ఈ సీతాకల్యాణమైన తరువాత వారితో చెప్పి విశ్వామిత్రుడు వారి నాశీర్వదించి ఉత్తరపర్వతము వైపు తపస్సు చేసికొనుటకు వెళ్లిపోయినాడు.

తరువాత రామాయణంలో విశ్వామిత్రుని ప్రసక్తి ఎక్కడా కనపడదు. ఐనా ప్రసక్తాను ప్రసక్తముగ శునశ్శేపునికథ మేనకావృత్తాంతము కూడా వివరింపబడ్డాయి. విశ్వామిత్రుడు పురాణ పురుషుడు. వేదాలలోను, ఇతిహాసాలలోను ఆయన చరిత్ర ఉజ్జ్వలంగా వర్ణింపబడియున్నది —

(ఆలిండియా రేడియో, విజయవాడ అనుమతితో)

(376 వ–పేజీ తరువాయి)

పురుష భక్తులనుండి శ్రీ శివానందులకు వచ్చు నుత్తర శతము పరికించిన సెందరెందఱో శ్రీ శివానందుల తమ తమ యిష్టదైవములగు శివ, రామకృష్ణ, వెంకటేశ, దుర్గ, సరస్వతి, సుబ్రహ్మణ్య, బుద్ధ, శంకరాచార్య, సాయిబాబా వగైరా "అవతార" మని కేవలము భూలోక భగవానుడే ననియు నింకా నేమేమో వారివారి దివ్యానుభవముల బట్టి వ్రాసి యుండుట సుస్పష్టమగును. ప్రత్యక్షముగ శివానందుల సందర్శించువారికిని నట్టి దివ్యభావమే స్వతస్సిద్ధముగ లోనుండి యుద్భూతమగును. వాస్తవికముగ నాధ్యాత్మిక దృష్ట్యా నీయన నేటి కాలపు రాజాధిరాజులు, సార్వభౌములు, చక్రవర్తులు మాత్రమే కాక నిస్సంశయముగ నధునాతన యుగమున "నవతార" పురుషుడే.

ఈ "సూర్యవర్చస్వి" యగు సిద్ధపురుషులు సదా "పూర్ణయోగము" (Synthetic yoga) ననుష్టానమునకై బోధింతురు. జర్మనీ, ఆఫ్రికా, మలయా, అమెరికా, ఆక్లండు, యింగ్లండు, ఫ్రాన్సు, ఫిజీదీవులు, ఆస్ట్రేలియా వగైరాలకు చెందిన విదేశీయులు సహితము (హిందూదేశమువారి గూర్చి చెప్పనేల) నన్దరు సమక్షమున "పూర్ణయోగ" శిక్షణమందుచు స్వదేశ గమనానంతరము "యోగవేదాంత" వ్యాప్తికై బద్ధకంకణులగు బహుసంఖ్యాకుల నిట సదా సంవత్సరపు టన్ని నెలల చూడనగును. అఖిల ప్రపంచమున జాతి, మత, లింగభేదముకాని దేశ, కాలవ్యవస్థా భేదముకాని లేక శిష్యులు గలరని తిరిగి యిప్పట్టున తెలుపుటనవసరము. ఈయన "సిద్ధసంకల్పులని, సంకల్పసిద్ధులని". వేరే నుడువ బనిలేదు.

సంవత్సరము పొడుగున ననగా 365 రోజులు శివానందాశ్రమ దేవాలయమున నధిష్టానమగు సజీవ జీవన్ముక్త పురుషులగు "అవతార్" శివానంద భగవాను దర్శనాశీర్వాదములకై, మనోరథ సిద్ధులకై వచ్చి సేవించు యాత్రిక బృందమున కంతుండదు.

శ్రీ శివానంద భగవాను లీజన్మమున మాత్రమే జీవన్ముక్తులు గారు. ఈయన ప్రస్తుత జన్మతో కలుపుకొని మూడు జన్మలుగ జీవన్ముక్తులై, శ్రీ సుబ్రహ్మణ్యావతారులై భాసిల్లుచున్నారు. తొలిజన్మమున శ్రీ సుందరమూర్తి నాయనారుగను, నాయనయే శ్రీ వడలూరు రామలింగస్వామివారుగ, ననంతరము "శ్రీ వడలూరు రామలింగస్వామి" వారే ప్రస్తుత "శివానందులు" గను నవతరించిరి. అనగా శ్రీ శివానందులు త్రిగుణ జీవన్ముక్తులు. ఇప్పటి జన్మతో కలుపుకొని శ్రీ శివానదులు మూడు జన్మలందును నాత్మ సాక్షాత్కృతి బొందినవారే. ఏల నిటు ముమ్మారవతరించవలసివచ్చిన దన భగవదాదేశముచే తమ కొరకేమాత్రమును గాక ప్రపంచోద్ధరణకు మాత్రమే. ఈ వివిధస్ఫురణలు "పాదసేవకుల" (స్వీయము) చే వివిధ సమయముల సమర్పింపబడి శ్రీ శివానంద భగవానులచే సామోదింపబడినవి. ఈ విషయముపట్ల స్వకీయపుముద్రితాంగ్ల వ్యాసము లును గలవు.

బోలో "అవతార్" శివానంద భగవాన్ కీ జయ్!

("మోక్ష మార్గదర్శి" యను గ్రంథము నుండి సంగృహీతము)

# సినిమా న్యూస్

శ్రీ రామా ఫిలిమ్సువారు 'భక్త అంబరీష' చిత్రము నిర్మిస్తున్నారు. ఇందులో కాంతారావు, జూనియర్ శ్రీరంజని మున్నగువారు నటిస్తున్నారు. దర్శకులు బోళ్ళ సుబ్బారావుగారు.

♦ ♦ ♦

కళాధర్ ప్రొడక్షన్స్వారి 'వాగ్దానం' చిత్రము నిర్మాణంలోనున్నది. ఇందులో జగ్గయ్య, జమున ప్రధాన భూమికలు నిర్వహిస్తున్నారు. దర్శకులు రంగూన్ రామారావుగారు.

♦ ♦ ♦

రాజు పిక్చర్స్వారి 'నిత్యకళ్యాణం, పచ్చతోరణం' అనే చిత్రం నిర్మాణంలోనున్నది. దర్శకుడు 'పినిశెట్టి' ఇందులో కృష్ణకుమారి, కే. వి. యస్. శర్మ, చలం మొదలగు వారు నటిస్తున్నారు.

చంద్రికా ఫిలింస్ వారిది 'శ్రీకృష్ణ రాయబారం' ఇందులో రఘురామయ్య, సుమ్మడి, సూరిబాబు, రాజనాల, కాంతారావు, సంధ్య, హేమలత బుష్యేంద్రమణి మున్నగువారు నటిస్తున్నారు. దర్శకుడు శ్రీ జగన్నాధ్.

♦ ♦ ♦

పద్మిని పిక్చర్స వారి 'వీరపాండ్య కట్టబ్రహ్మన' తమిళములోనుండి తెలుగులోకి డబ్ చేస్తున్నారు. పూర్తిగా గేవాకలరు చిత్రము. శివాజి గణేశన్ జమినీ గణేశన్, యస్. వరలక్ష్మి, పద్మిని మొదలగు వారు నటించారు. రచన, నిర్వహణ డి. వి. నరసరాజు, పాటలు సముద్రాల, దర్శకత్వం బి. ఆర్. పంతులుది.




చిత్ర సమీక్ష

## రాజ్యం పిక్చర్స్‌వారి కృష్ణలీలలు

రాజ్యం పిక్చర్స్ వారి 'కృష్ణలీలలు' చిత్రమును యీ నెల 7 వ తేదిన పత్రికా ప్రతినిధులకు విజయా స్టూడియోస్‌లో ప్రదర్శించారు.

దర్శకులు శ్రీ జంపన. సంగీతము శ్రీ దక్షిణామూర్తి. నిర్మాత శ్రీమతి రాజ్యం.

'కృష్ణలీలలు' కథ పాతదైనా నవీన పంథాలో తీయాలనే ఆసక్తిని డైరెక్టరుగారు, నిర్మాతలు చూపిరి.

యశోదగా లక్ష్మీరాజ్యం చక్కగా నటించింది. రేలంగి నందుని భూమికకు హాస్యరసం అంట కట్టడం అసహజంగా కనుపించింది. దేవకి, వసుదేవుల భూమికలు బాగానే నిర్వహించబడినవి.

ఇందులోని కాళియమర్దన, నృత్యసన్నివేశములు, ట్రిక్ ఫోటోగ్రఫీ ప్రజలను ఆకర్షించ గలవు.

ఇందులో పాడిన పద్యాలు బాగున్నవి.

ఈ చిత్రము ప్రజాదరణకు పాత్రం కాగలదని చెప్పవచ్చును.

—పున్నయ్య.

సజ్జన్ ఆర్ట్ పిక్చర్స్‌వారి ద్వారా విడుదలయిన 'ఇన్‌సాన్ జాగ్ యుఠ' హిందీ చిత్రము మద్రాసు ప్లాజాటాకీస్‌లో పత్రికా ప్రతినిధులకు ప్రదర్శించారు. ఇందులో సునీల్‌దత్, మధుబాల మున్నగు వారు నటించారు. ఈ చిత్రములో శ్రామిక జీవితములోని వాతావరణము సమర్థంగా చూపించబడింది. నాగార్జునసాగర్ డాం నిర్మాణ ప్రాంతపు వాతావరణము ప్రత్యేక ఆకర్షణ. సంగీతము మనోరంజకంగానున్నది. ఈ ఉత్తమ చిత్రం దక్షిణదేశంలో విజయయాత్ర సాగిస్తుందనడంలో సందేహములేదు.

♦ ♦ ♦

మద్రాసు వరలక్ష్మీపిక్చర్స్‌వారు వీనస్ స్టూడియోలో తమ ప్రొడక్షన్ నెం 4 కు యీ నెల 7 వ తేదిన ప్రారంభోత్సవము చేశారు. ఈ చిత్రానికి శ్రీకడారు నాగభూషణంగారు దర్శకత్వము వహిస్తున్నారు. కథ సదాశివబ్రహ్మంగారిది. సంగీతము అశ్వద్ధామ. ఇందులో గుమ్మడి, జగ్గయ్య, కన్నాంబ, జమున, రేలంగి మున్నగువారు నటిస్తున్నారు.

వేదమంత్ర పఠనము, పూజతో ప్రారంభమయిన యీ ప్రారంభోత్సవ సందర్భమున శ్రీ యస్. యస్. వాసన్ గారు స్విచ్ ఆన్ చేశారు.

అనేకమంది పత్రికా ప్రతినిధులు, నటీనటులు, సినీపారిశ్రామిక ప్రముఖులు యీ యుత్సవములో పాల్గొని చిత్ర నిర్మాతల ఆదర సత్కారములనందుకున్నారు.

♦ ♦ ♦

'కాళిదాసు' చిత్రాన్ని సారణి ప్రొడక్షన్స్‌వారు జూనియర్ శ్రీరంజని, నాగేశ్వరరావు మున్నగు నటీనటులతో నిర్మిస్తున్నారు. సంగీత దర్శకత్వము: పెండ్యాల. దర్శకుడు K. కామేశ్వర రావుగారు.

♦ ♦ ♦

శరత్ రచన 'బడదీది' గాథ నాధారంగాచేసికొని 'ఎండమావులు' అనే చిత్రాన్ని భరణీ పిక్చర్స్ వారు నిర్మిస్తున్నారు. రామకృష్ణ దర్శకత్వాన భానుమతి, నాగేశ్వరరావు, జానకి మున్నగువారు నటిస్తున్నారు. వేణు సంగీత దర్శకత్వమును నిర్వహిస్తున్నారు.




**శ్రీమతి : శ్రీ గోటేటి శ్రీరామారావు, ప్రకాశకులు, శ్రీకమల్ ప్రచురణలు, c/o శ్రీకాంతి పబ్లికేషన్స్, మద్రాసు 15. వెల 50 నయాపైసాలు.**

ఇది 'శ్రీమతి' కథతో ప్రారంభమయిన కథానికల సంపుటి. ఇందులోని కథలు చాలవరకు ఆంధ్రప్రభ, సూర్యప్రభ, మధురవాణి, నవ్వులరాణి మొదలగు ప్రసిద్ధమాసపత్రికలలో ప్రచురణమయినవి. కథలు చిన్నచిన్నవైనా నడక, భావముల పొందిక బాగున్నవి. పాఠకులకు చదువుతున్నంతసేపు వినోదం కలుగజేస్తూ అభిమానమునకు పాత్రమగునవిగానుండగలవు.

**నేనెవరు : శ్రీమిన్నికంటి సత్యనారాయణశర్మ, ప్రకాశకులు - సాధన గ్రంథమండలి, తెనాలి. వెల రు. 0. 75**

రచయిత తనగురువైన శ్రీ శ్రీయానందనాథా పరనామధేయ ఈశ్వరసత్యనారాయణ శర్మగారి ద్వారా ఆర్జించిన ఆధ్యాత్మికవిజ్ఞానమును ఆత్మపరిశీలనకు తోడ్పడునట్టి 'నేనెవరు' ను యీగ్రంథ రూపముగా రూపొందించుట గొప్పవిశేషము. మానవ జీవయాత్రలో ఆత్మజ్ఞానమును ఆర్జించుటవలన దివ్యత్వము సిద్ధించును. అందువలనముగా మోక్షసాధనసులువగుటయేగాక యిహంలో సుఖసౌభాగ్యములు విస్తృతం కాగలవు.

రచయిత యిందులో వేదశ్రుతులను, శ్లోకాలను మూలములతోబాటు సుదీర్ఘంగా వివరించి ఆత్మపరిశీలనకు, ఆత్మసాక్షాత్కారమును సుగమంచేయడానికి ప్రయత్నించారు. ఇది అమూల్యమైన గ్రంథము.

**అనామిక : శ్రీ ఇంగువ శ్రీనివాస. ప్రచురణకర్తలు సుమన్ ప్రచురణలు, కోర్టువీధి, ఒంగోలు, గుంటూరుజిల్లా. వెల 1 రూపాయి.**

ఇది అయిదుకథలుగల సంపుటి. రచన బహు సరళంగాను, పాఠకుల నుత్సాహపరుస్తూ నింపుతూ సాగినది. కథాసాహిత్యంపట్ల ఆసక్తిచూపుతున్న ప్రజానీకం యీ పుస్తకాన్ని విశేషంగా అభిమానిస్తారని మా నమ్మకం.

**శ్రీమద్భగవద్గీత : అనువాదకుడు - శ్రీపురాణపండ రామమూర్తి. ప్రచురణకర్తలు - ఆధ్యాత్మ ప్రచారసంఘము, ఆలమూరు, తూ॥ గో॥ జిల్లా. వెల 50 నయాపైసాలు.**

భగవద్గీతను సామాన్యులు సయితము పారాయణచేసి భావాన్నిగ్రహించి తరించడానికనువుగా యీ పుస్తకము రచించబడింది. మానవుని జీవయాత్రను తీర్చిదిద్దడానికి, ఆత్మపరమాత్మల పరిశీలనకు విశేషముగా తోడ్పచినట్టిది భగవద్గీత. ఇయ్యది యావన్మంది పఠించి తమ ఆధ్యాత్మిక, విలువల పెంపుదలవిని యోగించుకోడానికి యీచిన్న పుస్తకం ఎంతైనా ఉపకరించగలదు.

**సప్తర్షికృత శ్రీరామస్తుతి : అనువాదకుడు - డా॥ పురాణపండరామమూర్తి, ప్రచురణకర్తలు - ఆధ్యాత్మ ప్రచారక సంఘము, ఆలమూరు, తూ॥ గో॥ జిల్లా.**

శ్రీరామనామము సకలపాపహరమే కాక రక్తి ముక్తిదాయకం. అట్టి శ్రీరామునిస్మరించి, స్తుతించుటకుద్దేశించినదీ 8 పేజీల పుస్తకము. ఇందులో మూలశ్లోకములతోబాటు అనువాదము పొందుపరచబడియున్నది.

—(౦)—

# సంపాదకీయములు

## స్త్రీధనం మినహాయింపు

వరకట్నాల నిషేధం బిల్లు లోక్ సభలో చర్చజరిగి పరిశీలక సంఘమునకు పంపబడింది. ఈ సంఘం నివేదికను నవంబరు మధ్యభాగంలో సమర్పించవలసి యుంటుంది.

ఈ బిల్లు కట్నాలను యివ్వడం, పుచ్చుకోడాలను పూర్తిగా నిషేధిస్తున్నది. పెండ్లి సందర్భములో బట్టలు, యితర బహుమతులు అన్నీ కలిపి మొత్తం రెండువేలరూపాయలకు మించకుండా యివ్వవచ్చును; పుచ్చుకోవచ్చును. ఇంతకంటె ఎక్కువ కట్నకానుకలను యిచ్చి వారిని, పుచ్చుకున్న వారిని, ఇప్పించిన వారినికూడా ప్రభుత్వము యీ బిల్లు ప్రకారము శిక్షించవచ్చును. అయితే స్త్రీధనాన్ని నిషేధించరు. ఆ మొత్తము ఎంతైనా యుండవచ్చును.

ఈ బిల్లు ప్రతిపాదన సందర్భమున సభ్యులు ఈ బిల్లు క్రమబద్ధమై చాటుమాటున కట్నాలు యివ్వడమును, పుచ్చుకోడమును, యిప్పించడమును ప్రభుత్వము అరికట్టుచు, చట్టము నతిక్రమించు వారిని కఠినముగా శిక్షించవలసియున్నదని సూచించిన సందర్భమున కేంద్ర మంత్రి వరకట్నాల నిషేధం చట్టముతో పాటు ప్రజల సహాయ సహకారములున్ననే ఫలప్రదముగా అమలులో నుండగలదని యనడం గమనించ తగిన విషయం.

మగపిల్లలతో పాటు ఆడపిల్లలకు ఆస్తిపాస్తులలో సమానావకాశములుటూన్నప్పుడు స్త్రీధనమంటూ డబ్బు రూపంలో వివాహ సందర్భమున ఆడపిల్లల కీయవలసిన అవసరం సయితం కనుపించదు. స్త్రీ ధనం పేరుతో కట్నకానుకలను దొడ్డిదారిన వరుల తల్లిదండ్రులు, రాబట్టుకొనే ప్రయత్నానికి దారి ఏర్పడుతుందేమో ఆలోచించవలసియున్నది.

## ఆహారధాన్యాల ధరల పెరుగుదలకు కారణం?

ఆహారధాన్యాల ధరల పెరుగుదలకు ముఖ్యంగా యితర రాష్ట్రాలకెగుమతి చేయడమేనని ఆంధ్రప్రదేశ్ ముఖ్య మంత్రి శ్రీ సంజీవ రెడ్డిగారు ఈ మధ్య ప్రకటిస్తూ ఆంధ్ర ప్రత్యేక ఆహారమండలంగా నేర్పడే అవకాశములు కలవన్నారు.

వర్తకవ్యాపారాల దృష్ట్యా ఎగుమతి దిగుమతులవసరమయినా ప్రజావసరాలను గుర్తించకుండా ఆహారధాన్యాలే కాదు—తదితర జీవితావసరాలను సయితం ఎగుమతి చేయడం వాంఛనీయం కాదు.

## రామాయణ, భారతాల విస్మృతవినియోగం

సంస్కరించి బాలల భవిష్యత్తును తీర్చి దిద్దడానికి ఇండోనీసియాలో భారత, రామాయణములు విద్యావేత్తలకు విశేషంగా తోడ్పడుతున్నవని వింటున్నాము.

రామాయణ భారతాలను అనేక సంపుటాలుగా వారు ముద్రించి, ప్రచురించి ఇండోనీసియాలోని విద్యావేత్తలు, విజ్ఞులు స్వీయ సౌభాగ్యమునకు వినియోగించుకోడానికి ప్రయత్నిస్తుంటే మనదేశంలో వానిపట్ల ఆసక్తి తగ్గుతూరావడం దురదృష్టమని చెప్పాలి. రామాయణ భారతములలోని సన్నివేశములు మానవుని జీవితమును క్రమబద్ధంగా న్యాయాన్ని ధర్మాన్ని అనుసరింపజేయ గలవని గంటాపథంగా చెప్పవచ్చును. నీతి నియమాలను, పారమార్థిక చింతను, ఆధ్యాత్మిక దృష్టిని ప్రోత్సహించి మానవుని పూర్ణపురుషునిగా రూపొందించగల రామాయణం, భారతాది సద్గ్రంథములను మనం వినియోగించుకోడం విజ్ఞత కాగలదు.

---

1. కులులోయలోని మనలీపట్టణం యొక్క మనోహరదృశ్యము. చక్కని వేసవి నివాసకేంద్రమై పురాణకాలంనుండి ప్రసిద్ధికెక్కిన దగుటచే వినోదయాత్రికులకు, విదేశయాత్రికులకు ఆకర్షణీయముగా నొప్పుచున్నది.

2. తూర్పు బెంగాలునుండి నిర్వాసితులైన స్త్రీలు కలకత్తా సమీపంలోనున్న జపులి అద్దకం శిక్షణ కేంద్రంలో ఆకర్షణీయమైన క్రొత్తడిజైన్లను రూపొందించడం నేర్చుకొంటున్నారు.

---

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras Ag. Editor : C. C. Punnjah.
Proprietors : Kesari Kuteeram (Private) Ltd.

భారత ప్రశస్తి

THE PRIDE of INDIA




LODHRA

FOR LADIES' HEALTH

**KESARI KUTEERAM Private LTD.**
MADRAS-14.

లోధ్ర

స్త్రీల ఆరోగ్య భాగ్యానికి

LODHRA PRESS, MADRAS-14.